సంవత్సర చందా రు 1-0-0 (పోస్టేజితోసహా) Reg. No. M. 3766

సంపుటము 32 సంచిక 12

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

మార్చి 1944

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రాప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్ :— గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr. Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# విషయసూచిక







# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

## ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 32 | ఏలూరు, 15 మార్చి | సంచిక 12




## నిత్యసంకీర్తనము

**వివరణము :**

అహంకారము రెండువిధములు - సాత్వికము, తామసము. తామసాహంకారము ప్రపంచమునఁ బడఁద్రోసి కష్టముల పాలుసేయును. సాత్వికా హంకారము భగవంతునిసన్నిధికి చేర్చును. భగవంతునిచేతిలోఁ బరికరమునని భావించినచో శ్రేయస్సుగలుగును. ఇది యున్నతభావముచేతను, భక్తిచేతను గలుగుచున్నది.

**సంకీర్తనము :**

1. ఆసర్వజ్ఞుఁడగు భగవంతుఁడు నాభావములనెఱింగి
   దుష్టగుణములనన్నింటిని నిర్మూలించునుగాక !
2. నన్ను ఆయనచెంతకుఁ జేర్చుకొని కరుణారసముచే
   నా హృదయమును నింపి పవిత్రీభూతునొనర్చుఁగాక !

తభావములు, ఉత్తమాదర్శములు, నాలో బెంపొందునుగాక !

—స్వామి రామతీర్థ.

# వ్యాసకర్తల చిరునామాలు

1. మారెళ్ళ వెంకటసుబ్బారావుగారు, టీచరు, * గమ్మాలపాడు సత్తెనపల్లిపోష్టు గుంటూరుజిల్లా.
2. ఘంటసాల దుర్గాప్రసాదరావుగారు, టీచరు, మునిసిపల్ హైస్కూలు, * శ్రీకాకుళం (విశాఖపట్నంజిల్లా)
3. నేమాని కుటుంబశర్మగారు, టీచరు, * పెదరామభద్రపురము. పెంటకోటపోష్టు, (Via) తుని.
4. వేదుల నరసింహంగారు, టీచరు, * బూర్జ
5. నాగవోలు వెంకటఅప్పారావుగారు, హెడ్మాష్టరు, ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలు* పుర్లి సంకిలిపోష్టు (Via) పాలకొండ
6. A. S. Chalapati Rao Garu Rampuram పెందుర్తిపోష్టు వాల్తేరు R. S.
7. తాతా జగన్నాథరావుగారు, హెడ్మాష్టరు, * కొంరవ్యాం తంగుడుబిల్లిపోష్టు వాల్తేరు R. S.
8. కె అప్పలస్వామిగారు, టిచరు. ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలు, బరాటంవీధి, * శ్రీకాకుళం. (విశాఖపట్నంజిల్లా)
9. చిలకా వెంకటకృష్ణాదాసుగారు, మేనేజరు, ఎయిడెడ్ ప్రాథమికపాఠశాల, బరాటం వీధి, * శ్రీకాకుళం. (విశాఖపట్నంజిల్లా)
10. జి: కె. చౌదరిగారు, టీచరు, * పెయ్యేరు ముగినేపల్లిపోష్టు, (Via) గుడ్లవల్లేరు. కృష్ణాజిల్లా.
11. కల్లూరు అహోబలరావుగారు, టీచరు, * పెనుకొండ. (అనంతపురంజిల్లా)

---

# భగవన్నుతి

(కల్లూరు, అహోబలరావు)

సీ. భూమండలం బొండు ప్రేమతో నిర్మించి, జల భూ, విభాగంబు జక్కఁజేసి
జలరాసిలో ద్వీపసమితిని నెగడించి, ప్రాణికోటుల నందు పదిలపఱచి
పర్వతశ్రేణి భూభాగంబునం దుంచి, వాహినీవితతులఁ బాఱ నిచ్చి
ఘోరాటవుల నెన్నొ గొప్పగా నెలకొల్పి, భీకరమృగముల వెలయఁ జేసి
గీ. మనుజసంతతి నొక్కొండు మనఁగఁజేసి, మహితమైనట్టి విజ్ఞానమతి నొసంగి
విశ్వవిఖ్యాతితో నీవు వెలసినావు, భక్తమందార ! నీకిదే వందనంబు !
సీ. ఆదిత్యుఁ డొక్కఁడే యఖిలాండకోటికి, వెలుఁగు నిచ్చుటఁ జూడ వింతకాదె ?
సూర్యునిమించిన చుక్క లున్నవటంచు, వినుట దురూహ్యమా వింతకాదె ?

ఆధారహీనంబులై గోళజాలముల్, వేలాడు చుండుట వింతకాదె?
గిరగిర భూగోళ మురువేగమునఁ దిర్గు, విపరీతమరయంగ వింతకాదె?
గీ. అమెరికావారు మనక్రింద నమరియుంట, తలఁపఁ దలక్రిందులగుఁగాదె తథ్యమరయ
వింతలకునెల్ల నిది పెద్దవింత కాదె, భక్తమందార! నీకిదే వందనంబు.
సీ. ద్వాదశాదిత్యుల ప్రభ యెందునెల్లునో, యెన్నిలోకములున్న యెఱుఁగ లేము
గ్రహరాసు లెక్కడెక్కడఁ దిర్గుచున్నవో వానిమర్మము లేమొ పలుకలేము.
సప్తర్షు లాకాశ సౌధంబులో జుక్కలై మించు టేలనో యరయలేము
ధ్రువబాలకుఁడుగూడ రవిపథంబున నెల్గు, కారణ మేమియో గాంచలేము.
గీ. రాహుకేతుగ్రహంబుల యూహలేమొ, భుజగరూపంబులను వారుపొందినారె?
నీ రహస్యంబు నెవరు వర్ణింపఁగలరు, భక్తమందార! నీకిదే వందనంబు!
సీ. లెక్కింపఁజాలని రిక్కలు వెలుగొంద, నిర్వేదమలె గ్రహియింపనేల?
లక్షలకొలఁదిగా లంక లేర్పడియుండ నేడు దీవులనెడివాడు కేల?
ఆరుఖండరిబు లీధారణి నుండగ, భస్తి ఇంద్రాది, భూభాగ మెచట?
పర్వతంబులు, వేలపైఁబడి రాణింప, నెన్నిదింటిని పరికింపనేల?
గీ; ఊర్ధ్వలోకంబు లెచ్చట నున్నవయ్య, తలఁపగా నధోలోకసంతతులు గలవె?
నీదు కలరూపు మాకింత నేర్పవయ్య, భక్తమందార నీకిదే వందనంబు!

(సశేషము)

---

# శ్రీ కృష్ణ లీల

రచయిత: నేమానికుటుంబశర్మ

ఉ. నందుని మందిరాంగణమునం దొకనాఁడు యశోద యావుపాల్
పొందికతోడ దాఁ బితుకఁబూనె రయంబునఁ గృష్ణుచేష్టలెల్
డెందమునన్ స్మరింపుచు వడిన్ జనుదెంచె నొకింతలోన నా
సుందరరూపు డచ్చటికి చూచెడువేడుక నావిచిత్రమున్॥ ౧
క. ధరణీభారనివారణ కొఱకై, పరమేష్ఠి వేడ గువలయమందున్
వారిజన్మించియు బాలుని, కరణిన్ దాఁజూచుచుండె కౌతుక మొప్పన్॥ ౨
క. తనయుని ముఖారవిందము, వెనుదిరిగి, యశోద గాంచి విమలామృతమున్
కనులన్ దాగివుచు తనియక, అనిమేషస్థితిని దాల్చె నానందమునన్॥ ౩
క. ఆలోఁ భాండము నిండగ, పాలన్నియు పొర్లిపోవ పాలేఱయ్యెన్
నేలంతయు నది చూడమి, హేలావతి పితుకుచుండె నింకను పాలన్॥ ౪
గీ. కౌనువంచి మోఁకాళ్లపై గరములాని, నగుమొగంబున ముంగురుల్ నాట్యమాడ
అవ్విధం బంతయును జూచి నవ్వునట్టి, చిన్నికృష్ణుఁడు మనల రక్షించుఁగాత!

---

# ప్రాథమిక పాఠశాల

(జనవరి సంచిక తరువాయి)

ఆలయమున నెలకొల్పఁబడిన పాఠశాల కొన్ని కారణాంతరములచే వీధకెక్కి వీధిబడిగా మారుటయు, మఱల నది వీధివీధికి మారి గృహప్రవేశ మొనర్చుటయు జనవరి సంచికలోఁ జదివియున్నారుగదా? గృహప్రవేశమొనర్చినది మొదలది గృహపాఠశాలగనే నిర్వహింపఁబడుచున్నది. అప్పట్టున దాని పోషణము కేవలము ప్రజల మీఁదనే యాధారపడినది. ప్రజలుగూడ విద్యాభిమానము గలవారై తమ తమ యభిరుచులకొలంది తమ బిడ్డలకు సరియైన శిక్షాక్రమపద్ధతులమీఁద విద్య చెప్పించుకొనుచు బోధకులయెడ మిక్కిలి యాదరాభిమానములుగలవారై ప్రాథమికవిద్యాభివృద్ధికిఁ జాలతోడ్పడిరి. కాని పూర్వపు వీధిబడి నేటి ప్రాథమికపాఠశాలగా మారినప్పటినుండి యదియేమి చిత్రమో దాని చరిత్ర పూర్తిగా మారిపోయినది. ప్రజలకు దానియందభిమానము చచ్చిపోయినది. అసలు విద్యాస్వరూపమే తారుమారయినది. బోధకుల చిత్తవృత్తులు, వర్తనాదికములు, అడుగంటినవి. బడికి తమ పిల్లలను బంపుటయన్న పంతులుగారి బ్రదుకు దెరువునకే యను నానుడి ప్రజలలో బ్రబలినది. ఇంతటిమార్పు, ఇంతటి నిరసనభావము, కలుగుటకు కారణములు లేకపోలేదు.

వీధిబడిగా నున్నప్పుడు ప్రాథమికశిక్షకు ప్రత్యేక ప్రణాళిక లేదు. తల్లిదండ్రుల యిష్టప్రకారము పంతులు బాలురకు విద్యగఱపెడివాడు. వాచకధోరణి చక్కగా నుండెడిది. గణితశాస్త్రము కులవృత్తులకుఁ దగినట్లు బోధింపఁబడెడిది. ప్రైమరీతరగతిలోనికి వచ్చునప్పటికి సర్వేలెక్కలు, వడ్డీలెక్కలు, తులామానములు, ధాన్యపు కొలతలు, పుట్లలెక్కలు, మున్నగునవి యన్నియు, కరతలామలకముగానే నేర్పఁబడెడివి. ఆకాలములో ప్రైమరీ ప్యాసయినాడన్న విద్యయం దుత్తీర్ణుడైనాడన్న మాట. ఇప్పటి ప్రణాళిక ననుసరించి యిట్టి విద్యకుఁ దావులేదు, వృత్తివిద్యల కసలే తావులేదు. ఇంకవాచకధోరణి చూతమా నాలుగవతరగతి చదువు కుఱ్ఱవాడు వత్తుతప్పులు లేకుండ ఉచ్చారణదోషములు లేకుండ చక్కగా రెండు పంక్తులనైన చూచిచదువలేడు. రూపాయికి పైసలెన్ని రాయన్న తడుముకోకుండ చెప్పలేడు. తొమ్మిది, యెనిమిది కలిపిన నెంతయగునన్న వ్రేళ్ళు లెక్కపెట్టుకొనిదే జవాబు రాదు. ఇంక హెచ్చవేతలో "పదహారు పదునాలుగులెంత"యని ప్రశ్నించిన గుడ్లు తేలవేసి పంతులుగారి మొగముచూడవలసినదే. ఇనే ప్రశ్నలు పూర్వపు వీధిబడిలో చదివిన కుఱ్ఱవాని నడిగిన తడవుకోకుండ అడిగినదే తడవుగా నతడు గంట కొట్టినట్లు చెప్పగలడు. అతని కివియన్నియు రోకటిపాటలు. ఇప్పటి స్కూలుఫైనల్ కుఱ్ఱవానిని తెలుగంకెలు వేయుమన్న తెల్లమొగము పెట్టును. కోమటిపద్దు జాతీయముగా వ్రాయుమన్న చేత గాదు. నేటి ప్రాథమిక విద్యాప్రణాళికలో నిట్టివి

చేర్చఁబడకుండుటయే పల్లెప్రజల యసంతృప్తికి ముఖ్యకారణము. అసలిప్పటి ప్రాథమిక విద్యా ప్రణాళికను దిలకించిన అది తెలుగు మాతృభాషగా లేనియే విదేశీయులకో నిబంధింపబడినదిగా తోఁపకమానదు. కాకున్న ఆంగ్లభాషాపద్ధతులపై కూర్పబడిన దనుట సాహసముగాదు. ప్రథమావస్థలో ఎక్కములు, కూడికలు, తులాద్రవ్యమానములు, కొలత పరిమాణములు, మున్నగువానిని కంఠస్థము చేయింపక తప్పదు. అట్లయినగాని అవి పోనుపోను రాణింపవు. నేటి విద్యా ప్రణాళికనుబట్టి యేవిషయమును రోకటిపాటగా కంఠస్థము చేయింపరాదు. దిద్దబెట్టనురాదు. పల్లెప్రజల యసంతృప్తికిది యొక ముఖ్యకారణము పూర్వముకంటె నేడురానురాను ప్రాథమిక విద్యాపరిమితిని ఇంతగా తగ్గింపవలసిన యవసర మెట్టిదో యేతధికారులే బోధింపవలెను.

విద్యాపరిమితిని తగ్గించుటతోఁ బాటు అందరికి ఒకేరకపు విధానమును అమలుపఱచుట రెండవకారణము. దీనితో కొంతకు కొంతగానున్న ఆరవ్వంత యభిమానముగూడ అడుగంటినది. అయిదవ తరగతి చదివినప్పటికిని పుస్తకము ధారాళముగా చదువలేని స్థితిలో నున్నాడు నేటి ప్రాథమికవిద్యార్థి. ఇది చూడగా నే భూస్వామి యెందుకయ్యా యీచదువు, కూటికాగుడ్డగా అని నిరసించుచున్నాడు. అయ్యా! అయిదేండ్లు చదివించినాను - ఒక్కపద్దుగూడ చక్కగా వ్రాయలేడు - రూపాయికి డబ్బులెన్నంటే చెప్పలేడు - ఒక్కబజారుబిల్లు తప్పులేకుండ తేల్చలేడు మణుగుకు సవాశేర్లు ఎన్నంటే చెప్పలేడు- ఎందులకీచదువు అనివర్తకుడు వాపోవుచున్నాడు. పిల్లిపాలు త్రాగును- చెఱువులో కప్పలుండును-ఆవుపాలు తెల్లగానుండును. నిప్పు వేడిగానుండును - ఈవిషయములేనా మా పిల్లవానికి బోధించేది? ఏమి చదువయ్యా! అని మరొక వేత్త వెక్కిరించుచున్నాడు. ఈతీరున నేటి ప్రాథమిక పాఠశాల, ప్రాథమిక విద్య, ప్రజాదరణమునకు దూరములైనవి. ఇంతకు జాతీయ విద్యావిధానము సన్నగిల్లుటయే యీ నిరాదరణమునకు ప్రబల కారణమని కొందఱనుడువుచున్నారు.

కారణములెన్న సాగిన నెన్నియేనిగలవు. అసలున్నంతలో నైన విద్యచక్కగా కొనసాగుచున్నదా? ప్రాథమిక పాఠశాల దొరతనము వారి సహాయమును పొందుచున్నప్పటినుండి పెక్కునిబంధనలకు గురియైనది. ముందు పరిశుభ్రమైన, విశాలమైన గృహమొకటి యుండవలెను. అందు ఆటలకు ఖాళీస్థలముండవలెను. మలమూత్ర విసర్జనకు దొడ్డియుండవలెను. సృష్టి పరిశీలనకు తోటయుండవలెను. బడిలోగోడలకు జంతుపటములు, దేశపటములు, పూసలచట్రములు, పుల్లలగుత్తులు, చార్టులు, మున్నగునవి వ్రేలాడఁగట్టఁబడియుండవలెను. పిల్లలు కూర్చుండుటకు తగిన పరికరములుండవలెను. నల్లబల్ల, సీమసున్నపుకోపులు, మొదలగునవి యుండవలెను. ఇట్టివి యింకను పెక్కులు కావలెను. ఇందులో నేదిలేకున్నను పరీక్షాధికారులచేత లోపమెన్నబడును. దానితో గ్రాంటుతగ్గింపఁబడును. ఇవి యన్నియునుండి చదువు పూజ్యమైనను అంతగా గ్రాంటుతగ్గింపఁ బడుటలేదు. పరీ

క్షాధికారి పనిని చేసిబడి సంతృప్తిగా నున్నదని తన రిపోర్టులో వ్రాయును. ఇందువల్ల పర్యవసానమేమో విచారించండి. పంతులు చదువుపట్ల శ్రద్ధతీసికొనకున్న నుఇబ్బంది లేదు. కాబట్టి పరికరముల పట్లనే ఆయన ఎక్కువ శ్రద్ధ తీసికోవలెను. పరీక్షాధికారి ముందుగా పరీక్షించునదిగూడ పరికరముల నేగదా? ఇట్లున్న విద్యాభివృద్ధి యగుట యెట్లు? గ్రాంటు ఇచ్చునది పరికరములకా విద్యాభివృద్ధికా? ఈయంశము చక్కగా నిర్ణయింపఁబడిననాడు ప్రాథమిక విద్యతనకు దానన భివృద్ధి చెందగలదు. ఎట్లందురా? పరికరములన్నియు నుండవలె మంచిదే. ఒకవేళ పరికరములు కొంతతవడినను లోపములనెన్నక, విద్యాభివృద్ధినే ప్రధానముగా గమనించి దానికే యెక్కువ గ్రాంటు నిచ్చిన, ప్రతియుపాధ్యాయుడును పోటీ పెట్టుకొని తన బాలుర విద్యాభివృద్ధికై యెక్కువ కృషి చేయును. ఎవరికివారట్లు పోటీలతో కృషి చేసిన విద్యాభివృద్ధియగుట ఒకలెక్కా? కాబట్టి దొరతనమువారు గ్రాంటు నిచ్చుపట్ల, హాజరు తగ్గినదనికాని, పరికరములు లేవనికాని, ప్రతితరగతిలోను బాలబాలికలు, నిష్పత్తి ప్రకారము లేరనికాని, లోపములనెన్నక విద్యాభివృద్ధి యెట్లున్నది ముఖ్యముగా విచారించి, విద్యాభివృద్ధిగల పాఠశాలకు, ఎక్కువ గ్రాంటునిత్తురేని అచిరకాలములో ప్రాథమిక విద్యసర్వతో ముఖముగాఁ బెంపొందగలదనిమనవి.

ఇంతేగాక స్థానికసంస్థల యాజమాన్యమున నిర్వహింపబడుచున్న ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల కెట్టి వేతనములు లభించుచున్నవో అట్టి వేతనములే ఎయిడేడ్ ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులకు గూడ లభించునట్లు దొరతనమువారు తమ సహాయమును బెంపొందింపవలెను. తగినంత సహాయము లేకున్న ఉపాధ్యాయుడుత్సాహముతో పనిచేయలేడు. కడుపునిండ కూడుబెట్టి ప్రొద్దస్తమానము పనిచేయుమన్నను సంతోషముతో చేయవచ్చును. అట్లుగాక కడుపుమాడుచుండ పని చేయుమన్న గంటయైనను సంతోషముతో చేయలేడు. ఈ సూత్రమును గమనించి దొరతనమువారు ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులకు తగినంత సహాయము చేయుదురుగాక!

ప్రస్తుతయుద్ధ పరిస్థితులనుబట్టి ప్రాథమికోపాధ్యాయుఁడార్థికముగా బండిచక్రముక్రింద పడినపేడపెంచికవలె నలిగిపోవుచున్నాడు దొరతనము వారతని దుస్థితిని గమనించి అతనియాకలి మంటచల్లారునట్లు తగినంతక అవుకత్తెము నిచ్చి విద్యాప్రబోధమునకును, మిత్రమండలవారిసమర విజయ ప్రబోధమునకును, అతనిని ద్విగుణీకృతోత్సాహునిగా నొనరింపవలెనని మనవి. ఇందువివరింపఁబడిన లోపములన్నియు సవరింపఁబడి ప్రాథమిక విద్యాప్రబోధము జాతీయ దృక్పథమునకనుగుణముగా జరిగిననాడు, ప్రాథమికోపాధ్యాయుని గౌరవప్రతిపత్తులు పునః ప్రతిష్ఠింపఁబడినవాడు, నేటిప్రాథమిక పాఠశాల తొల్లింటివలె సర్వప్రజాదరణమునకు గురియై రాణింపగలదు.

— సంపాదకుడు.

# తప్పెవరిది

(ప్రాథమిక విద్యయందు ప్రజల బాధ్యతను గుర్తింపజేయు చిన్న నాటిక)

జి. కె. చౌదరి

(1944 వ సం॥ జనవరినెల సంచిక తరువాయి)

## మూడో రంగము

ఆరాత్రి మునసబు నరసయ్య తక్కుంగల గ్రామపెద్దల నందర్నీ గ్రామనౌకర్ల చేత పేరువారీగా పిలిపించాడు. దాదాపు 8 గంటలవేళకి మునసబు కరణాలిరువురు బొండ్రాయి దగ్గఱకు వచ్చారు. మరొక బజారునుండి వెంకటసుబ్బయ్య, సంజీవరావు, రమణరావులుకూడ అప్పుడే వచ్చారు. కబుర్లంపిన గ్రామపెద్దలేకాకుండా ఇతర గ్రామస్థులుకూడ చాలమంది వున్నారు అక్కడ. చౌదరయ్య నరసయ్య నుద్దేశించి-

చౌ:—ఇవ్వాళేమన్నా పంచాయితీవుందా నరసయ్య? దాదాపుగా అందర్నీ పిలవనంపావు.

న:—తగవూ లేదు; పంచాయితీ లేదు.

చౌ:—మరి ఈ హడావుడి అంతా?

న:—ఏమీ లేదు, మన ఊళ్లోవున్న పాఠశాలవల్ల క్రమమైన ప్రయోజనము కలగేటట్టు చేద్దామని.

చౌ:—ఈవరకు అక్రమప్రయోజనము కలుగుతావుందా యేమి?

న:—అవును మన పిల్లలకు తగినంతగా విద్యాభివృద్ధి కలగక పోవడమే అక్రమము.

చౌ:—ఇన్నాళ్లనుండి లేని ఆలోచన ఇప్పుడు ఎట్లా కలిగింది?

న:—ఈమధ్యాహ్నమే కలిగింది. ఈ యాలోచన-రమణ సంజీవరావులు మాట్లాడుతూ ఈవిషయమై ముచ్చటించారు, ఆసందర్భములో ఇది ఎంతయు అవసరమనుకున్నాము.

చౌ:—నిద్రమల్లకుండా రచ్చకీడ్చావు విషయాన్ని.

న:—తలుచుకున్నపని తలుచుకున్నట్టుగా చేయాలి రేపు నేను ఏలూరు వెళ్లాలి తిరిగిఎప్పుడు వస్తానో.

చౌ:—ఔను పదిఊళ్లపాపరాజువాయె సరే. అసలువిషయము ఏమిటి?

న:—ప్రస్తుతము మన బడిలో పిల్లలకు చదువురావడంలేదు. అందుచేత ఎవరికి వారికే ఈపాఠశాలఅంటే శ్రద్ధతగ్గి-ప్రయివేటు పంతుల్ని తీసుకురావాలనివుంది. ఆవిషయంలో వుపాధ్యాయుడు శ్రద్ధగా వుండేటట్టు-గ్రామస్థులు తమబాధ్యతలను గుర్తించేటట్లు చేయడానికే మిమ్మల్నందర్నీ పిలిపించాను.

చౌ:—ఐతే రమణ సంజీవరావులు వచ్చారా?

న:—ఆ. వచ్చారు.

చౌ:—మరి, పంతులుగార్ని పిలవనంపావా? ఆయనకువుండే సాధక బాధకాలు చెప్పాలిగా-

న:—లేదు మర్చిపోయాను.

చౌ:—నీవు పురోహితుడవైతే పెండ్లికూతురు లేకుండా వివాహాలు చేయించి వుందువు. వారు లేకుండా నీవు ఇక్కడ ఆలోచించే దేమిటి? త్వరగా పిలిపించు.

న:—వారినికూడా పిలవడము అవసరమే-పరాకున పడ్డాను. (గ్రామనౌకరు అల్లీసాహెబ్‌ను) అల్లీ-అల్లీ- (అనిపిలచును)

అల్లీసాహెబ్:—(నత్తితో) వ-వ-వ-వ-వచ్చానండీ.

న:—పెదబాపయ్యగారి ఇంట్లోవున్న పంతులుగార్ని పిలుచుకురా.

అ:—ఫ. ఫ. ఫ, ఫంతుల్ గార్కి బాబూ?

న:—ఔను సంజీవం, ఏమిట్రా ఇప్పుడు జరగాల్సింది?

సం:—పంతులుగారికి కబురు చేశారుగా వారినికూడా రానీయండి.

చౌ:—వారువచ్చి-వీరువచ్చి-పెందలాడే పూర్తవాలి. కట్టెవేతలలో వళ్లుముక్కలయ్యేటట్టు చాకిరీచేసి ఇక్కడ అట్టేసేపు కూచోలేరు.

అల్లీ:—(ప్రవేశము) ఫి-ఫి-ఫి-ఫిల్చుకవచ్చాన్ బాబూ.

న:—పంతులుగారూ, రండి.

పం:—(కూర్చొనును) ఎందుకండీ పిలిపించారు?

న:—మనిబడిలో పిల్లలకు చదువురావడంలేదని పెద్దపుకారుగావుంది-ఎవరికి వారే ప్రైయివేటు పంతుల్ని తీసుకురావాలనే ఆలోచనలో వున్నారు. మీరు అయినా అందుకుగాను పనికట్టుకొని వున్నారుగదా. ఇంకొకపంతులుగారివల్ల వచ్చిన చదువు మీవల్లావస్తుంది-ఈసందర్భములో మీకువున్న సాధక బాధకాలను తెలుసుకుందామని.

పం:—మంచిదండి, యాలోచన-కాస్త శ్రద్ధగా పనిచేస్తే చదువు ఎవరుచెప్పినా వస్తుంది, చదువు రాకపోవడము అంటువుండదు.

ఒకరు:—ఆ- మీకు పట్టిన పిచ్చేగాని- ఈ పంతుల్లు చదువెక్కడ చెప్తూతారు?

చౌ:—ఊరుకోవోయ్ వెధవా- నీకెందుకు?

న:—అసలు ఈ విషయమై మీ అభిప్రాయమేమిటి?

పం:—మీ ఆలోచన అభినందించదగ్గది. నామట్టుకు నేను పూర్తిగా హర్షిస్తాను. మీరు ప్రాథమిక పాఠశాలమీద ఇల్లాంటి శ్రద్ధ కనపరిస్తే మీ పిల్లలకు చదువు వచ్చితీరుతుంది.

2-వ వాడు:—మా శ్రద్ధలోనే చదువువుందా! మీరేమన్నా చెప్పేదివుందా!

పం:—కూరకు ఉప్పు ఎంత అవసరమో, కారమూ అంత అవసరమే— అట్లానే మీ శ్రద్ధ— దానితోపాటు మా బోధనా, ఈ రెండూవుంటేనే రాణిస్తుంది.

చౌ:—అసలు విషయము ఏమిటో ఆలోచించండి. ప్రొద్దుపోతావుంది.

న:-పంతులుగారూ, ఇంతకన్నా ఎక్కువ శ్రద్ధతో మా పిల్లలకు చదువు చెప్పాలి.

3-వ వాడు:——ఆ- చెప్తుతారు. కనకనే నలుగురు పంతుళ్లు పని చేసిన పాఠశాలలో ఒక్కరు పనిచేయడానికి పెటపెటగావుంది.

పం:——మీరుబడి ఈ స్థితిలోవుండటానికి గ్రామస్థులే కారణము.

న:——మేము ఏమి చేశాము అండీ; మా పిల్లలకు చదువు చెప్పవద్దంటున్నామా?

పం:——చెప్పవద్దనరు. కాని, మీ పిల్లలకు చదువు వచ్చేటట్టుగా శ్రద్ధకలిగి వుండకపోవడమే.

న: —ఆ మాట చెప్పి ఇంతకాలం నుంచి మీతో గల సంబంధము —— ఇప్పుడు——?

పం:——ఆ బాధ్యతను నేను హృదయపూర్వకముగా స్వీకరిస్తాను కాని —

న:——కాని ?

పం:——తల్లిదండ్రుల (గ్రామస్థులు) సహకారము లేనిది నేను కాదుగదా పాలాక్షుడుకూడా మీ బిడ్డలకు చదువు చెప్పలేడు.

4-వ వాడు ఈవరకు సరిగా చెప్పటము లేదు అంటే మా సహకారము లేకనేనా?

పం.——ఈవరకు కూడా చెప్పకపోవడము అంటూవుండదు, ఉపాధ్యాయుడు తన బాధ్యతను ఎన్నడూ మరచివుండడు.

న:——మా సహకారము అంటే ఏమిటి ?

పం:——మీరు అంటే విద్యార్థుల తల్లిదండ్రులు- ఒక కంట మమ్మల్ని- మరొకకంట తమ బిడ్డల్ని కనిపెట్టివుండాలి. పంతులుగారు ఏమి నేర్పుతున్నది- విద్యార్థులు ఏమి నేర్చుకొంటున్నది గమనిస్తూ పరిశీలిస్తూ, తాము గ్రహించిన లోటుపాట్లను ఉపాధ్యాయునికి నివేదిస్తూ వుండాలి ఈ పను లేవీ చెయ్యకుండా తమ బిడ్డల్ని బడికి పంపినంతమాత్రాన తల్లిదండ్రుల బాధ్యత తీరదు.

న.——తల్లిదండ్రుల బాధ్యత అంతవరకేనా ?

పం:——అంతేకాదు, మా ప్రయోజనాన్ని గుర్తించడముకూడా అవసరము.

న:——అంటే ?

పం:——ప్రాథమికోపాధ్యాయులమైన మేము ప్రజాసేవ చేయడానికి ఉద్భవించిన వివిధశాఖలలో విద్యాశాఖ ఒకటి అనీ- మేము మీ బిడ్డలకు విద్య నేర్పడానికై నియమింపబడ్డామనీ——మావల్లకూడ ఒక ప్రయోజనము ఉందనీ- ఉన్నత విద్యావంతులు అవడానికి ఉత్తమపౌరులవడానికి ముందు ప్రాతిపదికగా ప్రాథమికవిద్య నభ్యసించాలనీ మీరు గుర్తించాలి.

సంజీవరావు.——ఇది చాల మంచివిషయము. ప్రజలు ముఖ్యముగా దీనిని గమనించాలి. ప్రజలు విద్య గురువుయొక్క ప్రయోజనాన్ని గుర్తించకుండా వున్నారు. కనుకనే గురువువల్ల పొందవలసినంత మేలు పొందలేకుండా వున్నారు

చౌ:——అదేమిటో కాస్త తెలిసేటట్టు చెప్పరాదోయ్.

సం:—నిన్నగాక మొన్న టోపాదిగుమాస్తా ఊళ్లోకివస్తే చెప్పటానికి వీల్లేని గౌరవమర్యాదలు వార్షికమామూళ్ళు సరేసరి—క్రొత్తగా పంతులుగారు వచ్చారు అంటే—ఇట్టావచ్చి పలకరించిన పాపానపోయినవాళ్లు ఒక్కరన్నా వున్నారా ?

ఒకరు —టోపాదిగుమాస్తా అంటే ఈవూరు అంతటికి నీరుసప్లయిచేస్తున్నాడు. ఆయన పుణ్యమా అంటూ చక్కగా పంటలుపండి వేళకు ఇంత తినగలుగుతున్నాము. అందుకనే మామూళ్లు యిస్తున్నాము. కుప్పకట్టలు ఇస్తున్నాము. ఇంకెన్ని మర్యాదలైనా చేస్తాము.

రమణ:—అంటే నీ వుద్దేశ్యములో టోపాదిగుమాస్తాపాటి కూడా ప్రయోజనములేని వాడన్నమాట బడిపంతులు.

ఇంకొకరు:—నిజమాడితే నిష్ఠూరము కాని టోపాదిగుమాస్తా యెక్కడ— బడిపంతు లెక్కడ.

రమణ:—నిజంగా బడిపంతులుకు మరొకరికి పోందనేలేదు. బడిపంతులు తలుచుకుంటే భావిపౌరులగు బాలురను ఎన్నో విధాలుగా తయారుచెయ్య గలడు. ఈ విద్యార్థులలో ఎందరు డాక్టర్లు వున్నారా—ఎందరు ఇంజనీర్లు వున్నారో—ఎందరు న్యాయవాదులు; న్యాయాధిపతు లున్నారో—ఎందరు విజ్ఞానవేత్త లున్నారో-ఎందరు సత్పౌరులున్నారో—యదార్థంగా ఆలోచిస్తే మన బిడ్డలయొక్క నిజమైన అభివృద్ధే ఈ ప్రాథమికోపాధ్యాయుడు.

చౌ:—ఏమిటోయి మీ యిద్దరు P. W. D. మీదుగా బండితోలుతున్నారు?

సం:—బండి తోలడముకాదు ప్రపంచానికి టోపాదిగుమాస్తా చేసినపాటి మేలుచేయడాపంతులు ? క్షణికము, తాత్కాలికము, అయిన ప్రయోజనాన్నిచూచి ప్రాథమికోపాధ్యాయుని సేవను ప్రయోజనాన్ని విస్మరించడము కాకి బంగారాన్ని చేతపుచ్చుకొని బంగారాన్ని కాలదన్నినట్లుగావుంది.

3 వ-వాడు:—ఏతే ఇప్పుడు కుప్పకట్టలు ఇయ్యమంటావా ?

ర:—కుప్పకట్టలు ఇస్తే పంతులు ఆర్థికశక్తి ఇనుమడిస్తుంది. అంతమాత్రాన మీకువచ్చే ఫలితము 'నాస్తి'

న:—మమ్మల్నేం చెయ్యమంటావురా మరి ?

ర:—వారికి మీరు చేసే సాయము ఏమంతదికాదు. కాని వారివల్ల పూర్తిలాభాన్ని మీరు పొందటమే.

న:—అంటే ?

ర:—పంతులుగారినే అడగండి చెప్తారు.

న:—ఏమండి పంతులుగారూ ?

సం:—మీబిడ్డల్నందర్నీ క్రమంగా బడికి పంపుతూ, వాళ్ళనుగూర్చిన పూర్తి బాధ్యతను మీరు వహిస్తూవుండాలి. ఈ విషయములో పంతులుగారికి పూర్తిచేయూతనిస్తే మీపిల్లలందరు రత్నాల్లాగా తయారవుతారు.

చౌ:—అదేమిటో తెలిసేటట్లు చెప్పరామా?

సం.—పాఠశాలా నిర్వహణ సందర్భములో కావలసిన సాయసంపత్తులనుగూర్చి పంతులుగారే చెప్పతారు.

చౌ.—అసలు విషయము విడిచి చిల్లరమల్లర్లు పట్టుకు దేవులాడుతున్నారు. పొద్దుపోతావుంది. ఇంక కాస్సేపువుంటె మీరు తక్కినవారవ్వరూ వుండరు ఇక్కడ.

స:—పంతులుగారు, విస్తారుగా ఇప్పుడు సంజీవం, రమణలు మాట్లాడింది. మరి ఆసందర్భములో గ్రామస్థులు చేయదగ్గ సాయ సంపత్తులు ఎటువంటివో సెలవిస్తే వాటిని నెరవేర్చటానికి ప్రయత్నము చేస్తాము.

పం:—అట్లాయితే ప్రస్తుతము మీరు మాకు చేయువలసింది: బిడ్డల్ని క్రమంగా బడికి పంపడము- మేము చెప్పినపనుల్ని పిల్లలు ప్రాలుమాలకుండా చూడడము మీ బిడ్డల అభివృద్ధినిగూర్చి వాకబుచేస్తూ వుండడము- ఇది ప్రతివాళ్లూ చేయవలసింది. గ్రామమొత్తాన పాఠశాలకు సంబంధించిన యావత్తు బాధ్యతలను వహించడానికి కొందరు పెద్దమనుష్యులు ప్రత్యేకముగా వుండటము మంచిది.

చౌ:—వాళ్లేమిచేస్తారు?

పం:—ఇటు మాకు, అటు ప్రజలకు, మధ్యవుండి అభివృద్ధితో కూడుకున్న సామరస్య విధానాన్ని చేకూరుస్తారు.

స:—మా బిడ్డల శ్రేయస్సును కోరిన మేము ఈ స్వల్ప బాధ్యతను వహించడానికి ఎల్లప్పుడూ సంసిద్ధులమే.

చౌ:—ఇప్పుడు మీరు కోరిన ప్రకారము చేయడానికి అందరూ అయారే—మీకు ఏబాధా కలుగకుండా చూస్తూవుంటాము. పెద్దమనుష్యుల సంఘము అన్నారు. అది మాలో మేము నిర్ణయించుకొని, రేపో మాపో మునసబు మీతో చెపుతాడు. సరా!

పం:—అట్లానే.

చౌ.—ఏంరా మునసబు, ఈ పూటకు ఇక విడిచిపెట్టు.

స:—ప్రొద్దుపోయింది- వెళ్దాము. ఏమోయి రమణారావు?

ర:—చల్లచల్లగా కొందరు సర్దుకున్నారు. మనమూ వెళ్దాము.

ఎవరికివారు లేచివెళ్లుదురు. పంతులుగారు, రమణారావు సంజీవరావు, వెంకట సుబ్బయ్య కలిసి మాట్లాడుతూ పోవుదురు. క్రమంగా అందరూ నిష్క్రమింతురు.

[సశేషము.]

# పరిదేవనము.

(చిలకా వేంకటకృష్ణదాసు.)

సీ. తనమూర్తి సౌమ్యసుందరమూర్తి బహుజనాకర్షణం బొనరింప గాలనెవతె?
తననీతి బుధజనాదరణీయమై సర్వజగతి కాదర్శమై సాగెనెవతె?
తనకీర్తి సర్వదిగ్దంతి రద రచిత విలస దాభరణమై వెలసెనెవతె?
తన జీవితము దేశదౌర్భాగ్యమును బాప వెలుసాల కర్పణ జేసెనెవతె?
గీ. తనదుశీలము భారతవనితలకును, మేలుబంతియై యలరార మెలగనెవతె?
అట్టి కస్తూరిభాయిగాంధ్యములచరిత, కన్నుమూయ దేశంబె చీకటిగ దోచె.

సీ. భారతాంబలలాటఫలకమం దద్భుతశోభతో నలరు కస్తూరిబొట్టు
భరతనారీమణీ స్ఫటికాక్షమాలిక న్మెఱసెడి జాతివా మేలుపూస
హైందవస్త్రీల ధర్మాచారపంక్తులం దుత్తేజమున నొప్పు నోజబంతి
స్వాతంత్ర్యసమరపుష్కరమండలంబున విస్ఫూర్తితో వెల్గు వేగుచుక్క
గీ. యామె దనరారు మాయమ్మ నాదరమున, ఎలుగెత్తి పిల్చిన పలుకదాయె
కటకటంపాల నగదీయుకాలమందు మాతయే లేక నేనెట్లు మనగలాడ.

ఉ. తల్లిరో! భారతాంబ! పరితప్తము నీమది వేలనన్నగా
జెల్లిన నీదుకూతు రొకతె చెల్లిన నేమని యూరడింపగా
జెల్లును? మర్త్యయన్న మృతిసిద్ధ మటంటయె కాదె యందు శో
భిల్లి చిరంబుకీర్తిని త్రివిష్టప మేగెను చింతవీడుమా!

తే. గీ. అఖిలజనులకు శోకాబ్ధియందు ద్రోసి, శ్లాఘనీయమై పతిపాదసన్నిధాన,
మందు పసుపు కుంకుములతో హైందవాంగనాళివాంఛించు మరీతిని నమరసుఖము,
జూరగొన్న మాతల్లి కస్తూరిబాయి, యాత్మ శాంతికై పరమాత్ము నాత్మదలచి,
అశ్రుకణములతో తర్పణాంజలిడెద.

---

# పద్యకథలు

(1943 అక్టోబరు నెల సంచిక తరువాయి)

కె. ఎ. స్వామి

కవికొండల వారి పౌరాణికశిల్పములు కుంభకర్ణుడు (చిట్టికేత) శ్రీరాముడు (చదువులదుత్త) బంతిఆట (కుమారకంధం) మున్నగునవి యింకను మిగిలియున్నవి. తళుక్కునమెఱసి మాయమగు క్షణప్రభమే

పైకథలలో ముఖ్యస్థానమును వహించినది. కొండవంటి శరీరము, కోఱపండ్లు, వెను మిడిగుడ్లు, దొనెకడుపు, గల కుంభకర్ణుడు తపము జేయును. ఆరాక్షసడింభకునికోర్కె లోకసంహారణ. అందుచే నిర్దయను కోర

దలచినాడు. కాని నిద్రను కోరినాడు. "నిర్దయ మనంగ నందియు నిద్రయనురియో" ఈ యంత్యమే కథను సాగించినది. క్షణము మోపిసి మరల కటికచీకటిలో కూలబడును. మాపు చందమామను గోరు రాముని కోర్కె "తల్లి నన్నుపెట్టవయ్యా, తండ్రియు నన్నుపెట్టలేక పోను" గాని మంత్రియైన సుమంత్రి యద్దములో చంద్రమామను జూపును. మంత్రి వివేకగుణమును వెల్లడించుటయే యిందలి పరమార్థము. ఇట్టి కథలు భాషయందును, రసపోషణము నందును, అసంతృప్తిని వెల్లడించినది. వీరి పద్యకథలన్నియు దాదాపు ఇదే మాదిరిగా నున్నవి. వీరు రచించిన పద్యకథలలో వారి స్వతంత్ర కావ్యములలోని మెఱుగులు ప్రతిఫలించుట లేదు. పరికృతిచందనంలోని యొకటి ముదుసలి తాత పడవ నడుపుచుండును. మనుమడు చుక్కాని పట్టును. పడవ మెల్లగా పోవుచుండును. ప్రయాణికుడొకడు "ఒడ్డు చేరుట యెప్పటికి" అని ప్రశ్నించును. మనుమడు చిరునవ్వు నవ్వుచు క్షణములోనని జవాబిచ్చును. ముసలి తాత అంతులేని సంద్రమున మునిగి మునిగి వేసారిన వాడు గావున నిశ్వాసమును విడిచి "ఎప్పటికైననేమి యేటికి"ని నుడువును. ఇందలి వ్యంగ్యసంభాషణభావ గర్భితమగు పలుకులు ఉత్తమశ్రేణికి చెందినవి. స్వతంత్ర కావ్యములలోవలె పద్యకథలలో నిట్టి అందగింపులు సూక్ష్మముగానైనను గానరావు.

### ౭. చారిత్రిక పద్యకథలు.

ప్రతియుగమునకు చరిత్రగలదు. చరిత్ర ప్రతివారికి గావలసినది. జాతి, మత, సంఘ, దేశాదిచరిత్రలు, మానవగౌరవ మర్యాదలను గాపాడును. దేశచరిత్ర ప్రసిద్ధమగు గాథలు, రసావేశముగలవియై యుండునవి, పద్యకథల మూలమున రచింపబడవలయును. ఈపద్యకథలు నిరంకుశ మార్గము లంబోవక నిజమైన చరిత్ర దృష్టితో నిండి తూలుకాడవలెను. శౌర్యము, ప్రతాపము, అహింస మొదలగువానిని రచించునపుడు ఆయావిషయములకు రసమునకు తగు భాష నుపయోగించవలెను. ఉజ్జ్వల స్వాతంత్ర్యభావములను రచించునపుడు భాషభావపూరితమై గంగాజలధారావేగమున ఉరుకవలెను. దేశక్షేమ, ప్రజాక్షేమకరములగు చారిత్రక కథలను మననము జేయు కథారచయితలు మంత్రోపదేశికులవలె దేశభక్తి కలిగియుందురు. 'బేబరు' (చిట్టికైత) హుమయూను అస్వస్థతగూర్చి యిందు వర్ణింపబడినది. సంపూర్ణమాతా వేశమును, మహమ్మదీయుడును, నగు బేబరు చేయు ప్రార్థన—

ఓ! అల్లా! ఓ సాహెబ్జా ఓ! ఖుదావహీద్!
ప్రాణికై ప్రాణి నొడ్డెంగ బూనుచున్న
నేను సంసిద్ధుడను హుమయూను గావ
ఓ! రహీమ్! క్వబీర్! పహాబ! ఓ! గఫ! రబ!

అని, పరుషభాషా మిళితమై యుండుట తక్క అన్యత్ర యిందు చెప్పుకొనదగిన విశేషము లేమియును లేవు. 'బొబ్బిలిపిల్లడు' (చిట్టికైత) లో మల్లమాంబ తన పుత్రుని దాసిచే తమ్మునివద్ద కనుపును. మార్గమధ్యమున పరాసు సైన్యములు వారిని బట్టి విజయనగరాధిపునకప్పగింతురు.

"చక్కని బొమ్మలన్ నగల సన్నని బట్టల గొంగింబులన్
లక్కను జేసినట్టి రణరంగపు గాల్బల మాది చిత్రముల్
ఉక్కుని శాతఖడ్గముల నూడెడు బూరల కంచు తాళముల్

మున వీరమరణము నొందినవాడు సామాన్యుఁగు నే''యని మణిమయమంబగు కిరీటముదాల్చి వెంబడించినాడు. ప్రజలు, మంత్రులు, రాజు ననుసరించినారు. ''హారి ఫ్రైంటన్ సిరి లచ్చి వెంట.. .'' అన్నట్లు రాజరాజుల కైనను దుర్లభమైన జీవితం నిరుపేద యోధునిది.

బ్రూసుసాలీడు''కథ అనువాదము, నీతిదాయకము చరిత్రాత్మకము. కృష్ణారాయ కవిగారి పద్యములు సాగించినను, కుదించినను, పగ్గాలగట్టినను, కళ్ళెముల విచ్చినను, వర్ణనాయుతమైనను, తేటమాటలవైనను కూర్పునేర్పువలన అందమును వీడక మరిగందబిందు సమిత్రివోలె శోభిల్లును.

"స్వీయదేశము స్కాట్లండు స్వేచ్ఛకొఱకు
తనదు జీవితమెల్లను ధారపోసి
ఆంగ్లసేనల దలపడి యాఱుమార్లు
పోరుగావించి జితుడయ్యె బ్రూసురాజు"

కథాభాగము మొదటనే తెలిపోయినది. విసిగి వేసారి కార్యసాఫల్యమును గాంచక పాడుగుడిసె జేరి దినములుపుచ్చుట, ప్రోగిన వ్రేలియాడు సాలీడు వాని దృష్టిపథమున పడుట, మున్నగు సంశయములు ప్రకృతిసిద్ధమైన వర్ణనలతో తేటతేనియమాటల పొందికతో కూర్చినారు.

"గుడిస నడికొప్పునందున్న గూడునుండి
ఎట్టకేలకు గూటి యుయ్యాలను జేరె"

అన్న పదిపద్యములలో పైకి క్రిందికిని క్రిందికిని పైకి బంతిమీటినగతి గంతులిడిన సాలీని ప్రయత్నమే వర్ణింపబడినది. దీర్ఘమైనరచన సన్నగిల్లుటకు బదులుశోభ తెచ్చినది. సాలీనిజయముతో బ్రూసు రాజులో నూతన చైతన్యము కలిగినది. చెల్లాచెదరైన సేనలనుజేర్చి శత్రులనెదిర్చి స్వాతంత్ర్యమును సంపాదించును. ఇందులూతో, సాలీసు, సాలెపురుగు. వెలది, మున్నగు సాలెపురుగు పర్యాయపదములు వాడుట గమనింపదగినది. నీతి అభివృద్ధి పరంగ్రహమును మరాపునది. సుఖదుఃఖము రెంటిలో జీవిత ప్రతిభలు చక్కగా గా వర్ణింపబడినవి.

'బాలవీరుడు' చిట్టి చీమయు నోరరాని నెన్నెల తీగలునిగుడని, చుక్కలమినుమినుల్ చూరని, కటికటిక పాటకరించిన వినినములో—

"చిమ్మచీకటియు తన చెలిమి కాగా
తోరయగు ధైర్యసంపద తోడునీడ
స్వామిభక్తియె రమ్యభూషణము గాగ
ఎటకో చనుచుండె యోధుడా చిట్టి కేడు"

అథఘన నతి కిగి సాహసించి యోధుడు రాత్రియంతయు అభీకరమైన అడవిలో గడపును. తెల్లవారుట వర్ణింపబడినవి. ఇచ్చట ప్రభాతము, చీకటి చక్కగా వర్ణింపబడినది.

తనదుజనని చిరునవ్వో అనుగుజనని
కౌగిలింతయో, ప్రభుని ప్రకిరింటిచూపొ ?
గౌతమీపూత సలిల పగాహనంబొ ?
నీలకృష్ణా సరిత్తటీ విహారంబొ ?
కేళికోద్యానవనలతికా క్రీడనంబొ ?
ఏమి తలపోయుచుండెనో ఎవరి కెఱుక ?

ఆ ప్రశాంతనిశాంత సమయమున వాని నువ్విళులూరించు నూహ లేవోయని హైవానికంటె భిన్నముగానున్న—

"జరిగె నాత్రాత్రి సిద్ధంబు జయ మటంచు
మోద మందుచు నాతడు మురియుచుండె"

అన్నిటి యాతని ఉల్లాసవంతునిగా జేసినది "గుసగుసలుగావు పాముల బుసబుస లవి'' వైరులు బాలకనిచుట్టుకొని వానికరముమండి కత్తిని పెరకివైచిరి. ఒక్కడుకాదు, పదుగురు, పెక్కురుభూమి యీనినచందమున ఈగలతుట్టివలె మూగి

చీమగమిచే జిక్కు-చిలుంపగాలె నిలుచు చిక్కినాడు——

మిన్నుమంటిప సరగ నారు మెదపి లేచి
నిశితకరవాల ధారల నిశిరంబు
చెండు మీటినగతి చిందఁ జెండువారు" మని

వాడు బెదరించుచున్నను వానిలో వెలుగుచున్న చండమార్తాండ బింబము వంటి దేశభక్తి "దండు విడిసెను రిపుసేన లెండు, రండు" అనుచు నలిగెత్తి కేక వేయించినది.

"తిరుపుక్షత్తుల మొలుపులు తొండమీంప
గాని నెమ్మేన నెత్తురువాన కురియ
భూరి గర్వారవంబున నిరుదెటుచ
దండు విడిసెను రిపుసేన లెండు' టంచు

ఒకచే దెబ్బలనాచుకొని మరియొక చేత శంఖము పూరించును. రెండు సేనలకు యుద్ధము జరుగును. గెలుపు గలిగియు దేనికి గలుగదయ్యె నిండు మోదంబు పాలపీరుండు లేమి"——

(సశేషము)

---

## భూగోళ ప్రశ్నోత్తరములు

(ఐదవతరగతి)

లాతా జగన్నాధరావు, హెడ్మాష్టరు-శోంర్యాం.



(**1943** సం॥రం అక్టోబరు నెల తరువాయి)

మనవి:—ప్రాముఖ్యములగు పనులతొందరచే యీ మధ్య నీ ప్రశ్నోత్తరములు "ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా మాసపత్రికకు" అంపజాలకపోతిని కావున పాఠకమహాశయులు ఆగ్రహించక క్షమింపవేడెదను.

(Syllabus Heading —iii a) 5 —B. ఆసియాలోని ఎత్తైన ఎడారులు

**70.** మధ్యఆసియాలో ఎడారు లేర్పడుటకు గల కారణమేమి? యిచ్చటి శీతోష్ణస్థితి ఎట్టిది?

జ:—ఆసియాఖండముయొక్క మధ్యభాగము మిక్కిలి ఎత్తగు పర్వతభాగము. ఈ భాగము సముద్రమునకు చాలదూరమున నున్నది. చుట్టును పర్వతశ్రేణులచే ఆవరింపబడియున్నది. తేమతోగూడిన గాడ్పులు లోనికి రాజాలవు. వర్షము కడు తక్కువ. అందువలన ఈ భాగమంతయు చలి ఎడారిగాయున్నది. ఇచట శీతకాలములో భరింపరాని చలి.

**71.** ఈ ఎడారులలో ముఖ్యమైన వేవి?

జ:—ఈ యెడారులలో టక్లమాకన్ ఎడారి, గోబీ ఎడారి ముఖ్యమైనవి.

**72.** మధ్యఆసియాలోని ఎడారి ప్రజల జీవనము వేటిపై, ఆధారపడియున్నది?

జ:—ఇచటి ప్రజలు గొర్రెలు, మేకలు, ఒంటెలు, గుర్రములు, గాడిదలను, పెంచి, యీ మందలను మేపుకొనుచు, పచ్చికగల చోట్లకు తిరుగుచుందురు. ఈ పశువులే వీరికి జీవనాధారము.

Syllabus Heading.—III. A-5 c. టిబెట్టు.

73. టిబెట్టు పీఠభూమి ఏయేపర్వతముల మధ్య నున్నది?

జ:—టిబెట్టు పీఠభూమి ప్రపంచములోని పీఠభూములన్నిటిలోను మిక్కిలి ఎత్తైనది. ఇది దక్షిణమున హిమాలయములు, ఉత్తరమున క్వెన్‌లన్ పర్వతములు, పడమర కారకోరం పర్వతములకును, నడుమ నున్నది.

74. టిబెట్టునకు రాజధాని ఏది?

జ:—లాసా.

Syllabus Heading.—III. A-5 పంచసముద్ర ప్రదేశములు.

75. పంచసముద్రప్రదేశమన్న పేరేలవచ్చెను? ఇచటి శీతోష్ణస్థితి ఎట్టిది?

జ:—ఉత్తరమున కాస్పియన్, నల్లసముద్రములును, పడమర మధ్యధరా, ఎర్రసముద్రములును, దక్షిణమున అరేబియా సముద్రమును, గల్గియున్న ప్రదేశములకు పంచసముద్ర ప్రదేశమని పేరుగల్గెను. ఇచట వర్షపాతము చాలా తక్కువ.

76. పంచ సముద్రప్రదేశమున సారవంతమైన ప్రదేశములేవి? అచటి పంటలేవి?

జ:—మధ్యధరా, నల్లసముద్రతీరములు, టైగ్రిస్, యూఫ్రెటిస్ మైదానములు, అరేబియాలో ఏమెన్‌ప్రాంతములు యిందలి సారవంతమైన ప్రదేశములు. మిగిలిన భాగములు చాలవరకు ఎడారులే. సారవంతమైన ప్రదేశములలో గోధుమ, బార్లీ, ఫలజాతులను పైరు చేతురు.

77. పంచసముద్ర ప్రదేశములయొక్క చారిత్రాత్మకమగు ప్రాముఖ్యమెద్ది?

జ:—పూర్వము పంచసముద్ర ప్రదేశము గొప్పసామ్రాజ్యములకు పుట్టినిల్లు. మహమ్మదీయ మత జన్మస్థానమగు అరేబియా దేశము, క్రైస్తవ పుణ్యక్షేత్రమగు జెరూసెలము, యీ భాగమున నున్నవి. ఈ ప్రదేశము ఆసియా, ఐరోపాఖండములకు నడుమనుండుటచే ఈ భాగము వ్యాపారమార్గములకు ప్రసిద్ధిగాంచినది.

Syllabus Heading.—III. A-6 ఉష్ణమండలారణ్య ప్రదేశములు

(a) అమెజాను మైదానము.

78. అమెజాన్‌నది ఏఖండములోనిది? దీనియొక్క గొప్పతనమేమి?

జ:—అమెజాన్‌నది దక్షిణ అమెరికాఖండములోనిది. ప్రపంచమందలి నదీమైదానములలోనికెల్ల దీనిమైదానము పెద్దది. ప్రపంచమందలి ఏనదియు ఇంత ఎక్కువ నీరు గల్గియుండదు. ఈ నదీ మైదానమందలి అడవులు ప్రపంచమందలి అడవులన్నిటిలో పెద్దవి. గంగానదియంత పెద్దనదులీనదియొక్క ఉపనదులైయున్నవి. ఈ నదియొక్క వెడల్పు 50 మైళ్లకంటె ఎక్కువ. ముఖద్వారమునుండి 200 మైళ్ళవరకు సముద్రపు నీటియందలి ఉప్పదనమునుగూడ బోగొట్టునంతటి ఎక్కువనీటిని, ఈ నది సముద్రమునకు తీసికొనిపోవుచున్నది

79. అమెజాన్ నది ప్రదేశమందలి అడవులకేమని పేరు? అచటనుండు జంతువు లేవి ?

జ:—అమెజాన్ నది ప్రదేశమందలి అడవులకు సెల్వాసని పేరు. ఇచట అనేక రకములగు కోతులు, పాములు, [illegible], చక్కని చిలుకలు గలవు. నదులలో [illegible], మొసళ్ళు, తాబేళ్ళు, విస్తారముగ నుండును.

80. [illegible] ప్రయోజనములను [illegible]?

జ:—[illegible] పంపించుచున్నారు.

[సశేషము.]

---

# హైస్కూలులో

## [మహాత్మగాంధీ]

తర్జుమా

ఎ. యస్. చలపతిరావు పట్నాయక్ బి. ఎ. ఎ. భానుమూర్తి పట్నాయక్

నాకు పెండ్లియగు నప్పటికి నేను హైస్కూలులో చదువుచుంటినని యిదివరకే చెప్పితిని. మేము ముగురు అన్నదమ్ములము ఒకే పాఠశాలలో చదువుచుంటిమి. మా జ్యేష్ఠ సోదరుడు చాల పెద్దతరగతిలోను, నాతో వివాహమైన సోదరుడు నాకంటె ఒకతరగతి ఎక్కువగను, చదువుచుండిరి. పెండ్లియగుటవలన ఫలితముగా మాయిద్దరకు ఒక సం॥ రం వ్యర్థమైనది. నా సోదరునకింకను చెడ్డఫలితము కలిగినది. ఏలనన నాతడు చదువును పూర్తిగ విసర్జించి వేసెను. ఎంతమంది యువకులిట్లు బాధపడుచుండిరో దైవమునకే తెలియును! మన ప్రస్తుతపు హిందూసంఘములో మాత్రమే చదువులును, వివాహములును, ఒకపర్యాయము జరుగుచున్నవి.

నా చదువు కొనసాగించబడినది. హైస్కూలులో నన్ను మొద్దుగా భావించెడివారు కారు. నే నెల్లప్పుడును ఉపాధ్యాయుల ప్రేమను చూరగొనుచుండెడివాడను. అభివృద్ధి, శీలములగురించి యోగ్యతాపత్రములు తలిదండ్రులకు ప్రతిసం॥ రమును పంపబడుచుండెడివి. నాకెప్పుడును చెడ్డ యోగ్యతాపత్రము Bad certificate వచ్చియుండలేదు. రెండవతరగతినుండి కృతార్థుడనైన పిమ్మట బహుమానములనుకూడ Prizes పొందుచుండెడివాడను. నేను 5, 6, తరగతులలో రు 4 లు రు 10-లు విద్యార్థివేతనములను Scholarship బడసియుంటిని దానికిగాను నా స్వశక్తికిగాక నా అదృష్టదేవతకే నేను మిక్కిలి కృతజ్ఞతను చూపవలసియున్నది. ఎందువలననగా విద్యార్థివేతనములు కథియవాడ్ లో సూరత్ భాగమునుండి వచ్చిన తెలివితేటలుగల పిల్లవాళ్ళకు తప్ప, అందరకును యివ్వబడెడివి కావు.

నా శక్తిసామర్థ్యముల పట్ల నాకంతగా గౌరవము లేనట్లు నాకు జ్ఞాపకమున్నది. (My own recollection is that I had not any high regard for my ability) విద్యార్థివేతనములు బహుమతులు, వచ్చినపుడు నాకమితాశ్చర్యము కలుగుచుండెడిది. నా శీలమును జాగ్రత్తగా కాపాడుకొనుచుండెడివాడను. ఎంతచిన్న అపవాదునకైనను నాకు యేడ్పు వచ్చెడిది. నేను తప్పుచేసినను తప్పుచేసినట్లు ఉపాధ్యాయునకు కనబడినను, నాకు భరింపశక్యము గాకుండెడిది. ఒకపర్యాయము బెత్తముతో దెబ్బతిన్నట్లు నాకు జ్ఞాపకమున్నది. నేను తప్పుచేసినందుకు విచారించినట్లు ఆశిక్షకు విచారించలేదు. జాలికరముగా యేడ్చితిని. అది నేను ఒకటవ తరగతియో లేక రెండవ తరగతియో చదువుచున్నప్పుడు జరిగినది. నేను యేడవ తరగతి చదువుచున్నప్పుడు గూడ అటువంటి సంగతి జరిగినది. అప్పుడు డోరాబ్జి ఎడల్జిగిమి అను నాతడు ప్రధానోపాధ్యాయుడు. క్రమశిక్షకుడు గాను మంచివాడును అగుటచే పిల్లవాండ్రకు అతనియందు ప్రీతి. పెద్ద తరగతులవారికి అతడు ఆటలను, క్రికెటును, నిర్బంధించెను. నాకీ రెండును రుచించలేదు. నిర్బంధించకమున్ను క్రికెటులోగాని, కాలిబంతిలోగాని, లేక యేవిధమైన

కసరత్తులో గాని పాల్గొనియుండలేదు. నా ఒంటరి తనమునకు నా సిగ్గునకు ముఖ్యకారణము ఇది తప్పని నేనిపుడు గ్రహించితిని కసరత్తునకును, చదువునకును, సంబంధము లేదను చెడుభావము నాకుండెడిది. విద్యకున్నంత ప్రాముఖ్యము శరీరశిక్షణకును (Physical Training) యుండవలెనని నేనిపుడు తెలిసికొంటిని (Today I know that Phisical Training should have as much place in the curriculam as mental Training)

కసరత్తు చేయకపోయినను నాకు నష్టము కలుగలేదు. గాలిలో విశేషదూరము నడచుటవలన కలుగు లాభములను చదివియుంటిని ఈ సలహా నాకు నచ్చుటచేత విశేషదూరము నడచుట అభ్యసించుకొంటిని. నాకు నేటికిని యీ అలవాటున్నది. ఈ నడకలు [walks] నా శరీరమును దృఢపఱచినవి.

నా జనకునకు నర్సువలె సేవచేయవలయు నని నాకుండెడి కోరికయు నేను కసరత్తును నిర్లక్ష్యము చేయుటకు కారణము. పాఠశాల విడిచిపెట్టగనే యింటికి పోయి జనకునకు సేవచేయుచుండెడివాడను. నిర్బంధ కసరత్తు దీనికడ్డమువచ్చినది. నా తండ్రికి సేవచేయుటకుగాను నన్ను నిర్బంధమునుండి తప్పింపుమని శ్రీ గిమిగారిని ప్రార్థించితిని.

కాని నామాట నాతడు వినలేదు. ఒకనాటి శనివారమున- మాకు ఉదయమున పాఠశాలయున్నపుడు నేను పాఠశాలకు కసరత్తుకొరకు సాయంకాలము నాలుగుగంటలకు పోవలసియుండెను. నాకు గడియారములేదు మేఘములు నన్ను మోసపుచ్చినవి. నేను పాఠశాల చేరకమున్నే బాలకులందరు పాఠశాలను విడిచిపెట్టిరి మరునాడు హాజరుపట్టీని చూచి శ్రీ గిమిగారు నేను గైరుహాజరగుట కనిపెట్టిరి. ఆతడడుగగా జరిగినదంతయు విన్నవించితిని. నన్నాతడు నమ్మక ఒకటి రెండణాల జరిమానాను విధించెను [ఎంతయోసరిగ జ్ఞాపకము రాకున్నది.]

---

## విద్యా ప్రచార పుపాట

[రచయిత:—నాగవోలు వెంకట అప్పారావు-పుర్లి.]

(వెనుకటి సంచిక తరువాయి)

15. విద్య కీయిల సాటిగలదా - విద్యయే గురుదేవతా
విద్య రాజసుపూజితామర - విరులమాల కుమారకా బా॥
16. విద్యతల్లియు తండ్రియున్ గురు - విద్య నీసుఖతల్పము
విద్య గురులకు గురువు మరియును - విద్య కల్పమహీజము. బా॥
17. తల్లివలె రక్షించునది యీ - ధరణిలో చదువొక్కటే
తండ్రివలె హితమార్గ మిడునది - ధరణిలో చదువొక్కటే. బా॥
18. హితునితో సరిపోల్చ దగినది - వెదుకగా చదువొక్కటె
ఇల్లాలివలె ఖేదంబులను - ఇంకించునది చదువొక్కటే. బా।
19. పూజవలె తోషింపజేయుగ - భూరివస్తువు చదువొక్కటే
రాజువలె భూషింపజేసే - రాజ్యమీచదువొక్కటే. బా॥
20. బ్రతుకుతెరవు ప్రపంచమున - పొందించునది చదువొక్కటే
వెతలబాపి వివేకమున - వెలయించునది చదువొక్కటే.
21. అర్థహీనపు తిమిరమును - అడగించునది చదువొక్కటే.
శుద్ధజ్ఞానపు తేజమును - చూపించునది చదువొక్కటే. బా॥
22. శాంతిభూషణ చంద్రహారము - చేర్చునది చదువొక్కటే
శమము దమమును - సత్యసౌఖ్యము చేర్చునది చదువొక్కటే. బా॥

23. గురునిబోధలు భావిసుఖముల - తెరవులౌ నని తెలియరా
బాలభానునివలెన విద్య - ప్రపంచమున కే వెలుగురా. బా॥
24. బాల్యమున చదువబ్బినట్లుగ - ప్రాయమున నీకబ్బునా
బాల్యదశ ప్రారంభదశయే - భారతికి రుచియించురా. బా॥
25. విజయదుందుభి జయపతాక - విశేషములచే భూపతీ
వినయగరిమచే నిబుధవరు - డీవిధముకన్న సభాపతీ॥ బా॥
26. విద్యప్రేమోత్పాదనమూ అర - విద్యనిక ప్రమాదమూ
సాధ్యకాంచనసౌధమూ - సంపూర్ణవిద్య ప్రమోదమూ. బా॥
27. విద్యలేకయె వేషములచే - వినుతిగనవు విశ్వంబులో
మాటలేల నామాట వినుము ముమ్మాటి కిది సత్యంబురా॥ బా॥

---

## హిందూదేశము - ముఖ్యవిషయములు

వేదుల నరసింహము, బూర్జ.

[గతసంచిక తరువాయి]

### పంటలు, ఖనిజములు

| | ప్రపంచములో | ఇండియాలో |
|---|---|---|
| 1 వరి | చైనా, ఇండియా, బర్మా, ఇండోచైనా, జపాను, సయాం. | బంగాళము, అస్సాము, బీహారు, ఒరిస్సా, చెన్నరాజధాని. |
| 2 గోధుమలు | అమెరికా సంయుక్తరాష్ట్రములు, కనడా, అర్జంటీనా, ఆస్ట్రేలియా. | పంజాబు ఐక్యమాగాణములు. |
| 3 చెఱకు | క్యూబా, జావా, మారిషస్, ఫిజీదీవులు, హిందూదేశము గయానాలు. | సంయుక్త మాగాణములు బీహారు-ఒరిస్సా, పంజాబు. |
| 4 వేరుశనగ | ఇండియా, పశ్చిమ ఆఫ్రికా, చైనా. | చెన్నరాజధాని |
| 5 కాఫీ | బ్రెజీలు, కొలంబియా వెనిజూలా, ఈక్వెడారు గయానాలు. | మైసూరు, కొడగు, నీలగిరి కొండలు. |
| 6 తేయాకు | చైనా, అస్సాము, సింహళము, జపాను, జావా. | అస్సాము, బంగాళము, డెహ్రాడను, మైసూరు, కొడగు, తిరువాన్కూరు నీలగిరి కొండలు |
| 7 ప్రత్తి | అమెరికా సంయుక్తరాష్ట్రములు ఇండియా, ఈజిప్టు, చైనా. | కథియవారు, గుజరాతు, బీరారు, మధ్యపరగిణాలు, సింధు, పంజాబు |
| 8 ఉన్ని | ఆస్ట్రేలియా, న్యూజిలాండు, ఆఫ్రికా, అర్జంటీనా | |
| 9 ఇనుము | ఉత్తర అమెరికా, ఇంగ్లాండు, జర్మని, ఫ్రాన్సు, రష్యా. | |
| 10 నేలబొగ్గు | అమెరికా సంయుక్త రాష్ట్రములు, ఇంగ్లాండు జర్మని. | బీహారు, బంగాళ రాజధాని, నైజాము. |
| 11 పెట్రోలు | అమెరికా సంయుక్తరాష్ట్రములు, ఆసియా ఆసియాఖండములో పరిషియా, బాకువద్ద. | |

## హిందూదేశము—పరిశ్రమలు

1. ప్రత్తి పరిశ్రమ:—బొంబాయి, అహమ్మదాబాదు, చెన్నపట్టణము, కళ్ళికోట, మధుర.
2. జనపనార పరిశ్రమ–కలకత్తా.
3. ఉన్ని పరిశ్రమ:—కౌన్పూరు, లాహోరు, అమృతసరము.
4. ఇనుము. ఉక్కు–సామానులు:— } బీహారు రాష్ట్రమునందు జమ్షెడ్పూరు. మైసూరునందు భద్రావతి యొద్దను.
5. కాగితపు పరిశ్రమ:—కలకత్తా సమీపమున టిటాఘర్, మైసూరు వద్ద భద్రావతియొద్దను పంజాబులో లాహోరునందు.
6. తోలుపరిశ్రమ:—చెన్నపట్టణము, కౌన్పూరు.
7. సబ్బు పరిశ్రమ:—కళ్ళికోట, బెంగుళూరు, బొంబాయి, కలకత్తా.
8. సిమ్మెంటు పరిశ్రమ:—తిరుచునాపల్లి, బెజవాడ, బొంబాయి, షహరన్పూరు.

## దిగుమతులు.

1. నూలువస్త్రములు:—ఇంగ్లండు, జపాను.
2. ఇనుము, ఉక్కు–సామానులు:—ఇంగ్లండు.
3. గాజుసామానులు:—జపాను, ఇంగ్లండు, జర్మని.
4. రంగులు:—ఇంగ్లండు, జర్మని.
5. పట్టువస్త్రములు:—చైనా, జపాను, ఇటలీ.
6. రసాయినిక వస్తువులు:—ఇంగ్లండు, జర్మని.
7. కాగితము:—కెనడా, ఇంగ్లండు, జర్మని, నార్వే.
8. రైలుఇంజనులు, యంత్రములు:—ఇంగ్లండు, జర్మని.
9. పంచదార:—జావా, మారిసస్ దీవులు.
10. కిరసనాయిలు:—బర్మా, అమెరికా సంయుక్త రాష్ట్రములు, బోర్నియో, ఇరాక్, ఇరాన్.
11. లవంగములు:—జాంజిబారు.
12. మిరియములు:—స్ట్రెయిట్ సెటిల్ మెంట్సు.
13. సారాయి:—ఫ్రాన్సు, స్పెయిను, జర్మని.
14. కలప:—బర్మా, కెనడా, స్వీడను.

షరా:—ప్రస్తుత యుద్ధసమయమున పైన పేర్కొనబడిన వస్తువులలో జర్మని, జపాను, బర్మా, బోర్నియో, దేశములనుండి దిగుమతులు లేవని బాలురు గ్రహింతురుగాక.

## ఎగుమతులు.

| ముఖ్య రేవు. | సరకులు. | ఏదేశములకు ఎగుమతిఅగునది |
|---|---|---|
| 1. బొంబాయి | దూది, ప్రత్తి, | ఇంగ్లండు, ఫ్రాన్సు, చైనా, |
| | 2 గోధుమలు, | గ్రేటుబ్రిటను |
| | 3 బట్టలు, నూలు, | చైనా, పర్షియా, ఈజిప్టు, ఆస్ట్రేలియా. |
| 2. కలకత్తా. | 1 ధాన్యము, | ఇంగ్లండు, శింహళము |
| | 2 గోనెసంచులు, | ఇంగ్లండు, స్కాట్లండు, ఫ్రాన్సు, అమెరికా సంయుక్త రాష్ట్రములు, |
| | 3 తేయాకు, | ఇంగ్లండు, అమెరికా, |
| | 4 తోళ్లు | ఇంగ్లండు, అమెరికా సంయుక్తరాష్ట్రములు, ఫ్రాన్సు, |
| | 5 చమురుగింజలు | ఇంగ్లండు, ఫ్రాన్సు. |
| 3. చెన్నపట్టణము | చమురుగింజలు, | ఇంగ్లండు, ఫ్రాన్సు, |
| | తోళ్లు | ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికా. |
| 4. కరాచి | గోధుమలు, ప్రత్తి. | గ్రేటుబ్రిటను. |
| 5. విశాఖపట్టణము | మాంగనీస్ | ఇంగ్లండు, అమెరికా సంయుక్తరాష్ట్రములు. |

# మనదేశము—ముఖ్యపట్టణములు

1. లాహోరు—పంజాబు రాష్ట్రమునకు రాజధాని నగరము. రైల్వేకంపెనీవారి గొప్పకర్మాగారము గలదు.

2. అమృతసరము—ఈ పట్టణము సిక్కుల పుణ్యక్షేత్రము. ఇచ్చట బంగారు మలాముచేయబడిన సిక్కు దేవాలయము గలదు. ఇది శాలువలకు ప్రసిద్ధి.

3. లూధియానా—ఇది పంజాబు రాష్ట్రమునందు గలదు ఇది శాలువలకు, రంగులకు ప్రసిద్ధి.

4. సిమ్లా—ఇది మన దొరతనమువారి వేసవి విడిది.

5. ఢిల్లీ—ఈ పట్టణము యమునానదిమీద నున్నది. ఇది మనదేశపు రాజధానినగరము. మన రాజప్రతినిధి ఇచ్చటనే యుండును. ఇది రైలు కూడలిస్థలము. ఇది సంయుక్త రాష్ట్రమందుగలదు.

6. కరాచీ-ఇది సింధునదీ ముఖద్వారమునున్న రేవుపట్టణము, ఇచ్చటనుండి గోధుమలు, ప్రత్తి, ఇతరదేశములకు ఎగుమతియగును మనదేశమునుండిఇంగ్లండుపోవు విమానపు తపాలుఇచ్చటనుండి బయలుదేరును.

7. ఆగ్రా—ఇది సంయుక్తరాష్ట్రములందలి గొప్పపట్టణము. ఇచ్చట తాజమహాల్ గలదు.

8. కౌన్పూరు—ఇది తోలుపరిశ్రమకు, శాలువలుకు, ప్రసిద్ధిజెందినది. ఇది గొప్ప వర్తకస్థానము.

9. ప్రయాగ—ఇది గంగాయమునానదులు కలియుచోటున గలదు. ఇది గొప్ప పుణ్యక్షేత్రము. దీనినే అలహాబాదు అందురు. సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వముండుచోటు.

10 కాశి—ఇది గంగానదియొడ్డున నున్నది. మనదేశమందలి పుణ్యక్షేత్రములలో ప్రధానమైనది. ఇది బిహారు రాష్ట్రమందు గలదు. ఈ పట్టణము పట్టు, లోహపుపనులకు ప్రసిద్ధిజెందినది.

11. పాట్నా—ఇది బీహారు రాష్ట్రమునకు ముఖ్యపట్టణము. ఇదియే చరిత్రాత్మకమైన పాటలీపుత్రము. ఇది ధాన్యపు వర్తకమునకు ప్రసిద్ధి

12. మాంఘీరు.—ఈ పట్టణప్రాంతమున పొగాకుపండును. కనుక నిచ్చట సిగరెట్లఫ్యాక్టరీలు గలవు

13. కలకత్తా—ఇది బంగాళమునకు రాజధాని నగరము. ఆంగ్లసామ్రాజ్యమునందు రెండవ గొప్ప పట్టణము. గంగానదీ మైదానమునకు రేవుపట్టణము. ఇచ్చటనుండి వరి, జనుము, తేయాకు ముఖ్యమైన ఎగుమతులు. ఇచ్చట గోనెసంచులు. కాగితములు, నిప్పుపెట్టెలు, గాజు, ఇనుపసామానులు, తయారుచేయు కర్మాగారములు గలవు.

14 చిరపుంజి—ఈ పట్టణము అస్సాములో నున్నది ఇచ్చటప్రపంచములోకెల్ల వర్షము హెచ్చు. సంవత్సరమునకు సరాసరి 500 అంగుళముల వర్షము కురియును.

15 మచిలిపట్టణము—ఇది చెన్నరాజధానియందుగలదు బట్టలనేతకు, అద్దకపుపనికి ప్రసిద్ధిజెందినది.

16. విశాఖపట్టణము—ఇచ్చట నౌకాశ్రయమును నూతనముగ నేర్పరచిరి. ఇచటి కొమ్ము, దంతపు పనులకు చాలప్రసిద్ధి. ఇచ్చటనుండి మాంగనీసు ఇంగ్లండు, అమెరికాదేశముల కెగుమతియగును

17. బెజవాడ—ఇది ఆంధ్రదేశములోనెల్ల గొప్పరైలు కూడలిస్థలము. వర్తకస్థానము. కృష్ణానది యొడ్డుననున్నది. ఇచ్చట సిమ్మెంటుపరిశ్రమ జరుగుచున్నది.

18. చెన్నపట్టణము - ఇది మన రాజధాని ముఖ్యపట్టణము, రేవుపట్టణమైయున్నది. మనదేశములో 3 వ రేవుపట్టణమైయున్నది. ఇచ్చటనుండి తోళ్ళు, చమురుగింజలు, ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికాకు ఎగుమతియగును.

19. కళ్ళికోట—ఇది పడమటితీరమున గల రేవుపట్టణము, ఇచ్చటనుండి కలప, సుగంధద్రవ్యములు, కొబ్బరినార, కొబ్బరి ఎగుమతి చేయబడును. ఇచ్చట బట్టలు, సబ్బులు, తయారుచేయు యంత్రశాలలుగలవు. ఇచ్చట బంగాళాపెంకునుకూడ తయారుచేయుదురు.

20. మంగుళూరు—ఇది బంగాళాపెంకు తయారుచేయుటకు ప్రసిద్ధి.

21. ఎర్నాకులము—ఇచ్చట టాటాకంపెనీవారు చమురు యంత్రాలయమును నిర్మించి యున్నారు.

22. బొంబాయి—బొంబాయి రాజధానికిది ముఖ్యపట్టణము. గొప్పరేవుపట్టణము విదేశవ్యాపారమునకు కేంద్రస్థానము. ఇచ్చటనుండి దూది, గోధుమలు, వస్త్రములు ఇతరదేశముల కెగుమతి యగును. ఇది బట్టల పరిశ్రమకు ప్రసిద్ధి.

23. నాగపూరు—ఇది మధ్యపరగణాలకు ముఖ్యపట్టణము. రైలు కూడలిస్థలము. ఇది ప్రత్తి వ్యాపారమునకు ప్రసిద్ధి.

**24.** పెషావరు — ఇది వాయువ్య సరహద్దురాష్ట్రమునకు ముఖ్యపట్టణము. ఇది ఖైబరు కనుమవద్ద నున్నది. ఇచ్చట శత్రుభయములేనందున బ్రిటిషువారు కొంత సైన్యము నుంచిరి.

## ఇతర విషయములు.

డోల్డ్రమ్సు — భూమధ్య రేఖాప్రాంతమున అధికోష్ణము వలన గాలి పలుచనై పైకిపోవును. ఈస్వల్ప పీడన ప్రదేశమునకు "డోల్డ్రమ్సు" అని పేరు.

రోరింగు ఫార్టీజ్ — సమ శీతలమండలమునుండి ధ్రువప్రాంతమునకు వీచువాయువులు వ్యాపార ప్రతికూల వాయువులనబడును. ఇవి 40 దక్షిణ అక్షాంశమునకు దక్షిణమున బలముగ వీచుటచేత "రోరింగు ఫార్టీజ్" అనబడుచున్నవి.

### నాడీమండలముల కిరుప్రక్కల వర్షము అధికము. ఎందుచేత?

ఈ ప్రదేశములో ఉష్ణమధికము. అందువలన ఈ ప్రదేశము అతిస్వల్ప పీడన ప్రదేశమై పవనముల నాకర్షించును. ఆ పవనములు సముద్రములనుండి వచ్చుటచేత నీటియావిరిగలిగి అధికవర్షమిచ్చును.

### అయన రేఖా ప్రాంతమున ఎడారులు బయలుదేరుటకు కారణములు.—

అయనరేఖాప్రాంతమున ఉష్ణమధికము. అందుచేత భూసమీపమున గాలి వేడిఎక్కి పలుచనై పైకి పోవును. అప్పుడు పరిసరప్రాంతములనుండి పొడిగాడ్పులు వీచుటచేత వర్షముండదు. అందుచేత ఎడారులు ఏర్పడును.

### మధ్యధరాసముద్ర శీతోష్ణస్థితి:—

వేసవియందు బెట్టగనుండును. శీతకాలమందు వర్షములు కురియును. ఇట్టి శీతోష్ణస్థితికి మధ్యధరా సముద్ర శీతోష్ణస్థితి యని పేరు.

### మధ్యధరా శీతోష్ణభూములు:—

యూరపుఖండము — ఐబీరియా ద్వీపకల్పము, ఇటలీ బాల్కన్ ద్వీపకల్పము.

ఆఫ్రికా — నైరృతి వాయవ్యభాగములు. ఉత్తర అమెరికా — కాలిఫోర్నియా.

ఆస్ట్రేలియా — నైరృతి ఆగ్నేయభాగములు. దక్షిణ అమెరికా — మధ్యచిల్లీ.

### ఖండాంతరపు శీతోష్ణస్థితి:—

ఒక ప్రదేశము వేసవికాలములో ఎక్కువ ఉష్ణము గలిగి, చలికాలములో ఎక్కువ చలి గలిగి యుండును. వేసవి శీతకాలపు ఉష్ణోగ్రత భేదము ఇచ్చట హెచ్చుగానుండును. అట్టి శీతోష్ణస్థితికి ఖండాంతరపు శీతోష్ణస్థితియని పేరు. ఉదా. ఉత్తర ఐరోపా, హిందూదేశపు వాయవ్యభాగము. నాగపూరు.

## రైలుమార్గములు

**1. E I R** ఈస్టుఇండియన్ రైల్వే — హౌరానుండి అలహాబాదు-ఢిల్లీ మీదుగ అంబాలా చేరును.

**2. N W R** నార్తువెస్టు రైల్వే — అమృతసరమునుండి పెషావరుపోవును.

**3. G I P R** గ్రేటుఇండియన్ పెనన్సులరు రైల్వే —

[a] ఒకశాఖ బొంబాయినుండి నాగపూరువచ్చి B N R తో కలియుచున్నది. [b] మరియొకశాఖ రాయపూరు వరకువచ్చి M & S M తో కలియుచున్నది. [c] మూడవశాఖ జబల్ పూరు మీదుగ అలహాబాదుకుపోవుచున్నది.

**4. B N R** బెంగాల్ నాగపూరు రైల్వే —

[a] కలకత్తానుండి నాగపూరువరకు పోవును. [b] రెండవశాఖ వాల్తేరు వరకుపోవును.

**M & S M** మద్రాసు సదరన్ మహారాట్టారైల్వే —

[i] మదరాసు నుండి వాల్తేరు. [ii] మచిలీపట్నంనుండి మార్మగోవా. [iii] చెన్నపట్టణమునుండి బెంగుళూరు. [iv] గుంతకల్లు నుండి రాయచూరు.

**6. S I R** దక్షిణఇండియా రైల్వే —

[a] చెన్నపట్టణము నుండి రామేశ్వరము. [b] చెన్నపట్టణమునుండి మంగుళూరు.

# సప్త ద్వీపములు

రచయిత

నేమాని కుటుంబశర్మ

జంబు, ప్లక్ష, పుష్కర, క్రౌంచ, శాక, శాల్మల, కుశ, యనెడు సప్తద్వీపములు క్రమముగా ఆసియా, దక్షిణ అమెరికా, ఉత్తర అమెరికా, ఆఫ్రికా, యూరోపా. ఆస్ట్రేలియా, ఓషేనియాలను ఖండములై యొప్పుచున్నవి. ఆయాఖండములు కాయాద్వీపముల నామములుంచుటకు గల కారణ మొకింత విచారించెదము.

౧. ఆసియాఖండమునకు "జంబు" ద్వీపమని పేరు. 'జంబువు' అనగా నేరేడు చెట్టు. జంబు ద్వీపమునకు మధ్య జంబు వనెడు భూరుహ మొకటి యుండుటచే దానికా పేరు వచ్చినది. ఆవృక్షశాఖలు నాలుగు వైపుల దిగంతములవఱకు వ్యాపించి యున్నవి. ఆతరుమూలమునం దనవరత మొక నాపితేయుండు కాపురముచేయుచుండును. రాబోయెడు జన్మంబున నెవ్వండైన తలపున తనకిష్టమగు కోరికలతో నాశాఖ మొదటనున్న క్షురికనిచే క్షౌరకర్మ చేయించుకొని యామహీజమెక్కి కొనకుబారిక కొమ్మలమీదనుండి సముద్రములోనికురికి చచ్చువాఁడు: భూమియందు తనతలంపు బొప్పున మరల జన్మించును. కాని ఆజంబు వృక్షమునందు మఱియొక సంగతి కలదు ఎవరే యేకోరికలు కోరిన నాకోరికల ప్రయోగమున్న వారికే ఆ భూరుహ మగపడును గాని అట్టియోగము లేనివారికి వేయిసంవత్సరములు ఘోరమగు తపమొనర్చినను కనవట్టదు. ఆవృక్షమట్టి మాహాత్మ్యముచే నొప్పుచున్నది దానింగూర్చిమనకింక జర్చింపఁబని లేదు.

౨. దక్షిణఅమెరికా "ప్లక్షద్వీప" మని చెప్పియుంటిని. ప్లక్షమనగా రావిచెట్టు. జంబుద్వీపమునకు మధ్య నేరేడుచెట్టుండిన రీతిగా ఈఖండమునకుమధ్య అశ్వత్థ వృక్షముకలదు. మనము (హిందువులు) రావిచెట్టును పూజించునట్లు ఆ ఖండవాసులు కూడ ఆవృక్షమును పూజింతురు. అంతియే కాక అచ్చటి స్త్రీలు, పురుషులు, ధరించు దుస్తులు మనదుస్తులవలెను, వారలయాచారములు మన యాచారములవలెను ఉండుటచే పూర్వకాలమున మనవారచ్చటికి వలస పోయినట్లు తోచుచున్నది. హిందువులు వర్తకసరళిమీద శ్రీరామచంద్రునకుఁ బిదప వలసపోయినసంగతి నిశ్చయము. ఆకాలమునకుఁ డనవది బండ్లమీద, పొగబోటులమీద, ఆవిరిబుట్టయందు, ప్రయాణముచేసెడి వాడుక కలదు.

3. పుష్కరద్వీపమనగా ఉత్తర అమెరికా ఖండము. పుష్కరదీవినందుమ "పుష్కరణీ" యను సరస్సు కలదు. పుష్కరణీ యనగా నలుచదరముగాఁ ద్రవ్వఁబడిన కొలను. దానియందు పెక్కురాయంచలుండును. ఆమరాళములను భక్తితోఁ బూజించి పుష్కరిణియందు మునిగినచో హంసలు తమమూఁపునఁ జేర్చి వానిని మానస సరోవరమునకు తీసికొనిపోయి అచ్చట తేలునట. కాని యిప్పుడట్లు జరుగుట లేదు.

దానికి కారణమేమన త్రేతాయుగాంతమున గొంతమార్పుచేయు తలంపున నీభూతలమున విష్ణువుయోచించి యింద్రలోకములో నొకసభచేయించుతలంపునవిరించికి మహేశ్వరునకు దిక్పాలురకు, నారదాది మహర్షులకు, సురలకు ప్రకటనపత్రికలుపంపించెను. ఆసభకు వెళ్లదలచి బ్రహ్మలోకమునుండి హంసవాహనారూఢుడై బ్రహ్మ సరస్వతితో గూడ నాకలోకమున కేగుచుండ, పుష్కరిణియందీదుచున్న రాయంచలు ఆకాశమార్గమునబోవుచున్న యీమరాళముం జూచి పిల్వనెంచి యవి యార్చిన నాయఱపు విని విధాతను వహించిన హంస మోహించినదై నేలవ్రాలెను. ఇది యేమని బ్రహ్మయు సరస్వతియు నబ్బురమొందిరి. పిమ్మట పరమేష్ఠి తన దివ్యదృష్టివలన సర్వమెఱింగి తనపోక కభ్యంతరముగ గలిగించిన మరాళముల దెస రూక్షణ వీక్షణుండై "ఓ అంచలారా! మానస తటాకమునకు, పుష్కరిణికి, మధ్యగలద్వారమిక లేకపోవునుగాక! మీరు ఈ భూలోకంబున పంచరించుచు చేపలు, కర్కటము, లాహారములుగా కొంగలను పేరుతో పిలువబడుచుందురుగాక" యని శపించి తన యంచకు బుద్ధిచెప్పి మరల హంసవాహనుండై యిరువురు దివికేగిరి. అది లగాయితు పుష్కరిణీ మహాత్మ్యము చెడినది. మానస సరోవరమునకు దీనికి మార్గముపోయినది హంసములు కొంగలు బాతు లనెడు నామములను ధరించినవి.

౪. ఆఫ్రికాఖండమునకు "క్రౌంచ" ద్వీపమని పేరు. క్రౌంచ ద్వీపమున క్రౌంచ మనెడొక పర్వతముగలదు. ఆపర్వతమందు విశల్యకరణి, సంధానకరణి, సంజీవకరణి యనెడు మహత్తరమగు జీవనమిచ్చె డోషధులు గలవు. అన్నివేళల కుమారస్వామి యాకొండపై నివాసము చేయుచుండును. ఔషధముల మహిమచే నచ్చటివారు దేవతలవలె మృతినెఱుగక సుఖముగా నుండెడివారు కాని రామ రావణుల రణమందు లక్ష్మణుని మూర్ఛ తేల్చుటకు ఆ క్రౌంచగిరిని వాయునందనుడు లంకకు గొనిపోయి తరువాత నాతండచ్చటనుండి గిరగిర త్రిప్పి యథాస్థానమున పడునట్లు విసరివేయగా నాపర్వతము తిరిగివచ్చి బోర్లపడెను. అందుచేత నిప్పుడా సత్తాపోయినది.

౫. శాకద్వీపమన ఐరోపాఖండము. దీనికే "హీరో" ఖండమను నామాంతరము కలదు. "శాకః అనగాసామర్థ్యము. ఆఖండవాసులు మిగుల సామర్థ్యముకలవారు. దానికే శ్వేతద్వీపమనికూడ పేరు. దశకంఠుండు కూడ శ్వేతద్వీపవాసులచే పరాభవింపబడెను. ఆకథ అందరకు విదితమే. అట్టి పరాక్రమముగల వారాదీవియందుండుటచే దానికా నామమిడిరి.

౬. ఆస్ట్రేలియా ఖండమునకు "శాల్మల" ద్వీపమనిపేరు శాల్మలీయనగా బూరుగు చెట్టు. ఆదేశమున బూరుగు వృక్షము లెక్కువగా నుండుటచే దానికాపేరుపెట్టిరి. కృతయుగ, త్రేతాయుగంబులయందా వృక్షరాజంబులా దీవియందుండి ద్వాపరంబున నన్నియు నొక్కమారే హరించిపోయినవి. అందులకొక పరమరహస్యమైన చిత్రముకలదు. దైవని యతివలన తపోభంగము కాబడిన తాపసులు శాల్మలీ తరువులై జన్మింతురు. శ్రీకృష్ణావతారమందలి పదారువేల గోపికలు శాల్మలీ

దీవియందలి బూరుగువృక్షములు వారలది పరలోక తపోభంగముకాబట్టి యటులుదయించిరి వారలను శ్రీకృష్ణుడు కాంతుండుగాడు. శ్రీకృష్ణమూర్తికి వారలు కాంతలుగారు. వారు మోక్షముగోరి అటులువిదలై జనించిరి. ప్రపంచ నటనకు మాత్రము అటులు కనపడెడివారు. వారందఱు పరమభాగవతాగ్రేసరులు. అస్ఖలిత బ్రహ్మచారియగు శ్రీకృష్ణుడు లీలా మానుష విగ్రహుడగుటచే నెవరి కేరూపు వలయునో యటుల నటన మొనరించి వారల కానందమిచ్చును. అటులనే గోపికలతో నటనమొనర్చి వారలకు మోక్షమిచ్చెను.

౭. ఓషేనియాకు "కుశదీవి" యనిపేరు శాంతమహాసముద్రములోని దీవుల సముదాయమునకుఓషేనియాయనునామమిడిరి. వానికే "కుశ" యనిపేరు కుశయనగా పాపము. అదియొనర్చినవారి నాదీవులకు పంపుదురు. శిశుహత్య, స్త్రీహత్య, రాజహత్య మొదలగు ఘోరపాపములొనర్చిన వారిని ద్వీపాంతరవాస శిక్ష ననుభవించుటకై పంపబడుచుండుటచేవానికాపేరువచ్చినది.

సప్తసముద్రములుకూడ ఈ భూలోకంబుననే గలవు అవెన్నియనః—

1. కారుప్పునీటితో నిండిన హిందూ మహాసముద్రమే లవణసముద్రము, 2. చెఱకురసమువలె కఱినల్లనగు శాంతమహాసముద్రమే (పసిఫిక్ మహాసముద్రము) యిక్షుసాగరము, 3. కల్లునవలె నుఱుగు లంతట నుండుటచే అట్లాంటిక్ మహాసముద్రమే సురార్ణవమని పిలువబడెను 4. నేయివలె పేరుకొనిన నీటితో నిండిన దక్షిణ మహాసముద్రము (అంటార్కిటిక్ మహాసముద్రము) నేతిసముద్రమని పిలువబడుచుండెను. 5. గట్టిపెరుగువలె గడ్డకట్టిన నీరుగల ఉత్తరమహాసముద్రము (ఆర్కిటిక్ మహాసముద్రము) పెరుగుసముద్రము, 6. పాలవలె తెల్లని నీటితో కూడియున్న తెల్లసముద్రము క్షీరరత్నాకరము, 7. మంచినీరుకల మధ్యధరాసముద్రము మంచినీళ్లసముద్రము.

ఇవియె సప్తసముద్రములని తోచుచున్నది. వాటివాటి రంగు, రుచులను బట్టి యీరీతిగా విభజించి పేర్లుపెట్టిరికాని నిజముగా అట్టిమహాసముద్రము లెక్కడుండును ?

# సభలు—తీర్మానములు

## నందికొట్కూరు

నందికొట్కూరు తాలూకా ప్రాథమికోపాధ్యాయ సంఘకార్య నిర్వాహకవర్గము 13-2-44 తేది ఆత్మకూరులో మాకేజి సీనియరు డిప్యూటీ ఇన్స్పెక్టరుగారగు శ్రీ కంభంమెట్టు వెంకటేశ్వర్లు బి.ఏ.బి.యిడి గారి అధ్యక్షతను సమావేశమయ్యెను. నంద్యాల జూనియరు డిప్యూటీ ఇన్స్పెక్టరుగారున్ను సభ నలంకరించిరి. శ్రీ డి నారాయణయ్యగారిని తాలూకాసంఘ కార్యదర్శిగా నెన్నుకొనిరి. ఏప్రిల్ నెలలో వెలుగోడునందు తాలూకా కాన్ఫరెన్సు జరుపునట్లును యుద్ధనిధికి 50/రులు నిచ్చి రక్షణపత్రములు కొనునట్లు తీర్మానించిరి.

డి. నారాయణయ్య,
తాలూకా కార్యదర్శి.

22—2—44

విశాఖపట్నం ట్రయినింగుస్కూలు విద్యార్థిసంఘము 25-2-44 తేదిని శ్రీ పిప్పిలి మన్మథరావు పట్నాయక్ గారి అధిపత్యముక్రింద సమావేశమైనది. ఈ క్రిందవ్రాసిన తీర్మానము లంగీకరింపబడినవి.

**1.** శ్రీమతి కస్తూరిబాయి గాంధి మనలను విచారసాగరమున ముంచి స్వర్గస్థురాలైనందున శ్రీ మహాత్ములవారికి వారి కుటుంబమునకును యీ సంఘమువారు తమ సానుభూతిని తెలుపుచున్నారు. (ఈ సందర్భమున శ్రీ ఎ. యస్. చలపతిరావుగారు, ఆవిడ నిర్బంధమున యుండగానే చనిపోవుట బ్రిటిషు ప్రభుత్వ ప్రతిష్టకు భంగకరమనిరి.)

**2.** కరవుభత్యము లందరికీ యిచ్చుచున్నారుగాని ప్రాథమికపాఠశాలల ఉపాధ్యాయులకు చాల తక్కువగ యిచ్చుచున్నారు. దీనితో కుటుంబపోషణ జరుగుట కష్టముకావున ఉపాధ్యాయులకు కరవుభత్యము లెక్కువగా యివ్వవలయునని ప్రభుత్వమువారిని యీ సంఘమువారు కోరుచున్నారు.

**3.** హైయ్యరు ట్రయినింగు విద్యార్థులకిచ్చు **Stipend** రు 6 లు కాక రు 2 లు కరవుభత్యముల నియమింపవలసినదిగా ప్రభుత్వమువారిని యీ సంఘమువారు ప్రార్థించుచున్నారు. దీని విషయమై ఆందోళన అవసరము గాన తక్కిన ట్రయినింగు స్కూలు విద్యార్థులుకూడ సభలు జరిపి తీర్మానములు చేసి వాటిని ప్రభుత్వమునకు పంపవలయును.

**4.** వయోజనవిద్యపై నిషేధమును (మదరాసు ప్రభుత్వమువారు 1941 లో నిషేధమును తెచ్చిపెట్టిరి. దానిని తొలగించవలసినదిగా ప్రభుత్వమువారను కోరడమైనది

**5.** ధర్మపత్నముననున్న మిత్రమండలికి జయము తప్పకుండ కలుగవలయునని భగవంతుని యీ సంఘమువారు ప్రార్థించుచున్నారు.

**2—3—44**
**విశాఖపట్నం** }

వై. అప్పలస్వామినాయుడు.
కార్యదర్శి.

---

అనంతపురంజిల్లా, గుత్తితాలూకా, గడేకల్లు, బోర్డు హిందూ కో ఎడ్యుకేషన్ స్కూలునందు 29-2-44 దినము బడికి నూతనముగా రాబడిన 20 మంది బాల, బాలికలనుండి సరస్వతీపూజ అతి మనోహరముగా జరుపబడెను.

బడియందలి బాలబాలికలచే హెడ్ మాష్టర్ గారగు బి. వి. సంజీవరాయుడుగారు భూకైలాసమను నాటకము చూచువారల కానందమగునటుల ఆడించిరి.

తదుపరి 1st అసిస్టెంటు మిస్ట్రెస్ గారగు సి. శేషమ్మగారు బాలికలచే గొబ్బి, కోలాటము మొదలగునవి అత్యానందముగా వేయించిరి.

తదుపరి **2nd** అసిస్టెంటు టీచరు గారగు యస్. యమ్. నాగలింగస్వామిగారు బాల, బాలికలనుండి అభినయగీతములు వినువారల కింపుగొల్పునట్లు పాడించిరి.

**విద్యా యుద్ధ ప్రచారవిషయములు :—**

బడియందలి ఉపాధ్యాయులందరును బాలబాలికల నెల్లరును వరుసగాపెట్టి గ్రామమునందంతటను విద్యా & యుద్ధగీతములు పాడించుచు వూరేగించిరి. చివరకు గ్రామమునందలి శ్రీ వేములవాడ భీమలింగస్వామి ఆలయమునందు అందరును చేరి మంగళముతో సమాప్తి గావించిరి.

బడియందలి ఉపాధ్యాయులందరును బాలబాలికలతో చేరి ఉర్వకొండ శ్రీకరిబసవస్వామిగారి బోర్డు హైస్కూలునందు 4 వ ఫారం చదువుచుండు యస్. పురుషోత్తమాచార్ అను బీద విద్యార్థికి కొంత ధనసహాయము చేసిరి. ఈలాగు విద్యార్థులకు సహాయముచేయుటకుగాను బడియందు బీదవిద్యార్థిఫండు **(Poor boys fund)** ఈ దినముననే మన హెడ్ మాష్టర్ గారి అధ్యక్షతక్రింద ప్రారంభింపబడెను. ఈ బీద విద్యార్థిఫండునకు దొరలందరును తమ శక్తికొలది సహాయము చేయవలయునని కోరుచున్నాను.

గడేకల్లు,
**3-3-44.** }

యస్. యం. నాగలింగస్వామి,
టీచరు.

## టీచర్సు ఎసోసియేషను శెంటరు వార్షికసభ, గాండ్లకుంట.

12-2-1944 వ తేదీన మా కేంద్రోపాధ్యాయసంఘ సమావేశము శ్రీ **B. N. Somiah Garu** B. A. B. ED. (**Senior Deputy Inspector of Schools, Jammalamadugu Range**) గారి అధ్యక్షతక్రింద, క్రంద పేర్కొన్నచందమున జయప్రదముగా జరుపబడెను.

**1.** దైవప్రార్థన, **2.** మిత్రమండలివారికి త్వరలో విజయము సేకూరుగాక.

**3.** శ్రీ అధ్యక్షులవారు **Conference** మరియు **Exhibition** ను గురించియు, క్రొత్తసెలబసు ననుసరించి చార్టులు మొదలగు ముఖ్యవిషయములు బహు సూక్ష్మ పద్ధతితో వస్తువులు తయారుచేయునట్లు తెలిపిరి. ఉపాధ్యాయులెల్లరు కడుంగడు సంతసించిరి.

**4.** రాజభక్తి కీర్తనలతో సభ జయప్రదముగా ముగించబడెను. యస్. రామసుబ్బన్న,

సెక్రటరి.

---

## వా ర్షి క స భ

ది 26-2-44 తేదీని కొవ్వూరు తాలూకా టీచరు మేనేజర్ల సంఘ దశమవార్షికమహాసభ కొవ్వూరు హైస్కూలు భవనమునందు ఉదయము 9 గంటలకు మ. రా. శ్రీ శ్రీపాద పేరిశాస్త్రి (రిటైర్డు డి. యినస్పెక్టరు ఆఫ్ స్కూల్సు) B. A L. T. వారి ఆధిపత్యమున జయప్రదముగా జరుపబడెను. ఈ సభయందు ఈ క్రిందిగువ తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

**1.** మిత్రమండలి వారికి అన్నిరంగములయందును జయము చేకూరుగాకయని భగవంతుని యీ సభవారు ప్రార్థించుచు తీర్మానించడమైనది.

**2.** పదిసంవత్సరములు సర్వీసుగల **Untrained** టీచరు మేనేజర్లకు పర్మనెంటు ఎగ్జెంప్షన్ యిప్పించగలందులకు శ్రీ డైరెక్టరు దొరవారిని యీ సభవారు కోరుచు తీర్మానించడమైనది.

**3.** గ్రామములోనున్న బడియీడుపిల్లలను వీలైనంత ఎక్కువమందిని బడియందుచేర్చి గ్రామమునందలి ప్రజలలో విద్యను అభివృద్ధిచేయు బాధ్యత ఉపాధ్యాయులపైన పెట్టబడియుండుటచే ఉపాధ్యాయులు పిల్లలను అనేకవిధముల ప్రోత్సహించియు, అవసరమైన తల్లిదండ్రులను బ్రతిమాలియు, పిల్లలను బడిలో చేర్చవలసివచ్చుచున్నది. అందువలన పిల్లలనుండి ఎట్టి జీతములును వసూలుచేయుటకు అవకాశము లేకపోవుటయేగాక యితరవిధములైన పరిమానములన్నియుగూడ నశించినవి. ఉపాధ్యాయుడు పూర్తిగా గవర్నమెంటువారిచ్చు గ్రాంటుపైననే ఆధారపడవలసివచ్చినది. ఇట్టి స్కూళ్ళను "ఎయిడెడ్" స్కూళ్ళు అని పిలుచుటలో అర్థములేదు. గనుక యిట్టి స్కూళ్లకు "ఎయిడెడ్" అను పేరు తీసివేసి యిందలి ఉపాధ్యాయులకు గూడ బోర్డు, మ్యునిసిపల్ మొదలగు ప్రాథమిక పాఠశాలలలో పనిచేయు ఉపాధ్యాయుల వేతనములకు సమానమైన వేతనములను లేక గ్రాంటు స్కేళ్ళను మార్పుచేయించి గవర్నమెంటువారు యిప్పించవలసినదిగా యీ సభవారు కోరడమైనది.

**4.** ఈ అరికదుసితి రోజులలో పాఠశాలల నిర్వహణము చాలకష్టముగా యున్నది. కాన ఎయిడెడ్ పాఠశాలల అద్దె గ్రాంట్లు యిప్పింప ప్రభుత్వమువారిని యీ సభవారు కోరుచున్నారు.

**5.** తీర్మానము —ఈ సంఘ వ్యవహారములకు ప్రతిసంవత్సరము సాలు 1కి సరిపడు ఖర్చు సొమ్మును శెక్రటరీ, ప్రసిడెంటు అంచనావేసిన ప్రకారము యీ సంఘమునకు యిచ్చుటకు శ్రీ ఈదర వెంకట్రావు పంతులుగారు యీ సభాముఖమున వెల్లడించియున్నందున యీసభవారు వారిఔదార్యమును కొనియాడుచు వారికి తమ కృతజ్ఞతను వెల్లడించుచున్నారు. **6.** తీర్మానము —సంఘోద్యోగులు.

1. **J Suryanarayanamurty Teacher Manager President. Singavaram N. D. D. Post.** **2. M. Venkateswarlu Teacher Manager, Secretary Kalavacherla (Via) N. D. D. Post.**

మిగత కార్యనిర్వాహక సభ్యులను ఆయా సెంటర్లనుండి ఎన్నుకొనిరి.

**7.** మహాజనసభలో జమాఖర్చులు ఏకగ్రీవముగా ఆమోదించబడెను.

**8.** వందనములతో సభ ముగింపబడెను. **M. Venkateswarlu,**

**J. Suryanarayanamoorty, President.** **Secretary.** 2-3-44.

---



శ్రీమదాంధ్రమహాభాగవతము
పోతనామాత్యప్రణీతము
శ్రీమదాంధ్ర
మహాభాగవతము
రామా అండ్ కో.
ఏలూరు
మద్రాసు
అష్టాదశపురాణసారములు
రామా అండ్ కో.
ఏలూరు
మద్రాసు
Rs. 4/8